# చారిత్రక రైతు మహోద్యమం

# చంపారన్ సత్యాగ్రహం

## (శతవార్షికోత్సవం)


మూలం

**మహాత్మా గాంధీ**

**జె బి కృపలానీ**

**ఇర్ఫాన్ హబీబ్**

**తుషార్ గాంధీ**

సంపాదకులు

**రావెల సోమయ్య**

స్వేచ్ఛానువాదం

**గౌరవ్**



ప్రచురణ

**లోహియా విజ్ఞాన సమితి**

101, గోదా నిలయం, మయూరి మార్గ్,

హైదరాబాద్-500016

# అంకితం

శతాబ్దాలుగా

ఈ దేశంలోని ప్రజలందరిచేతా

పదేపదే మోసగించబడుతూ కూడా

మనందరికీ

పట్టెడన్నం పెట్టేందుకు

అనునిత్యం

అనుమానాల్ని,

అవమానాల్ని సహిస్తూ,

దుర్మార్గమయిన వ్యవస్థ

మౌనం పై వ్యథ చెంది

ఆత్మహత్యలు చేసుకుంటూ కూడా

ఆకలి తీర్చేందుకు చూసే

భారతదేశం రైతాంగానికీ,

చేనేత కార్మికులకీ,

క్షమాపణలతో....

## కృతజ్ఞతలు

ఈ గ్రంథం ఇలా వెలువడేందుకు అనేక విధాలుగా సహకరించి తోడ్పడిన వారెందరో ఉన్నారు. వివిధ రూపాల్లో శక్తికొద్దీ సాయం చేసిన మిత్రులు, హితులు, సన్నిహితులు, శ్రేయోభిలాషులు.... వీరందరికీ పేరుపేరునా మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

*లోహియా విజ్ఞాన సమితి*

# ఇందులో....


| | | | |
|---|---|---|---|
| | మలిముద్రణకి ప్రకాశకుల పలుకు | – *రావెల సోమయ్య* | 7 |
| | రెండో ముద్రణకి ముందుమాట | – *గౌరవ్* | 9 |
| | మా మాట | – *సంకలన కర్తలు* | 16 |
| | రైతు సత్యాగ్రహ పోరాటాల శతసంవత్సర సంరంభం | | 17 |
| | | – *డా॥ ఎ.బి.కె. ప్రసాద్* | |
| 1. | అణిచివేతపై అన్నదాతల చెర్నాకోల.... | – *గౌరవ్* | 21 |
| 2. | చంపారన్ సత్యాగ్రహం వంద సంవత్సరాల రైతుల యథాతథస్థితి | | 31 |
| | | – *తుషార్ గాంధీ* | |
| 3. | చారిత్రక మహోద్యమం – చంపారన్ సత్యాగ్రహం | | |
| | | – *ఇర్ఫాన్ హబీబ్* | 33 |
| 4. | మొట్టమొదటి సత్యాగ్రహం | – *ఆచార్య జె.బి. కృపలానీ* | 41 |
| 5. | నీలిమందు మచ్చ | – *మహాత్మాగాంధీ* | 56 |
| 6. | చంపారన్‌ను స్మరించుకోవడం గాంధీని స్మరించుకోవడమే | | |
| | | – *సుధీర్‌చంద్ర* | 75 |
| 7. | చంపారన్ సత్యాగ్రహ శతసంవత్సర సంరంభం | | |
| | | – *జయావింధ్యాల* | 78 |
| 8. | చంపారన్‌తోనే గాంధీ ప్రస్థానం | – *రామచంద్ర గుహ* | 82 |
| 9. | మహాత్ముడూ చంపారన్ ఆంగ్లేయులూ | – *రామచంద్ర గుహ* | 87 |
| 10. | గాంధీజీ 'చంపారన్' ప్రయోగం | – *చలసాని నరేంద్ర* | 90 |

| | | | |
|---|---|---|---|
| **11.** | చంపారన్ ఓ చుక్కాని | - కె. రామచంద్రమూర్తి | **96** |
| **12.** | వందేళ్ళ తర్వాత | - వాడ్రేవు చినవీరభద్రుడు | **101** |
| **13.** | తొలి చారిత్రక మహోద్యమం చంపారన్ సత్యాగ్రహం | - రావెల సాంబశివరావు | **107** |
| **14.** | చంపారన్ రైతు సత్యాగ్రహం - సమీక్ష | - జె. ఎస్. రఘుపతిరావు | **113** |
| **15.** | Champaran Crusade | - Jawaharlal Jasthi | **115** |
| **16.** | Indian Struggle in 1917.. | - Anil Nauriya | **118** |
| **17.** | Global Significance of Champaran Satyagraha | - S.N. Sahu | **123** |
| **18.** | Farmers Freedom from Debt Bill | - Kisan Mukti Sansad | **140** |




## డా॥ రామమనోహర్ లోహియా ప్రతిపాదించిన 7 విప్లవాలు

1) స్త్రీ పురుషుల మధ్య సమానత్వం కోసం,
2) వర్ణ విచక్షణ పైన, దాని కారణంగా ఉత్పన్నమయ్యే రాజకీయ, ఆర్థిక, ఆధ్యాత్మిక అసమానతలకి వ్యతిరేకంగా,
3) సనాతన సంప్రదాయాల ఫలితంగా వెనుకబడిన, మరియు అభివృద్ధి చెందిన సమూహాల, లేదా కులాల మధ్య ఏర్పడిన అసమానతలకి వ్యతిరేకంగా, ఇందులో వెనుకబడ్డ సెక్షన్లకి ప్రత్యేక అవకాశాలు సాధించుకోవడం కోసం.
4) విదేశీ బానిసత్వానికి వ్యతిరేకంగా, స్వేచ్ఛకోసం, ప్రపంచ ప్రజాస్వామ్యం కోసం,
5) ఆర్థిక సమానత్వం కోసం, ప్రణాళికాబద్ధమైన ఉత్పత్తి విధానం కోసం, ప్రైవేటు పెట్టుబడి ఉనికికీ, దానిపై మమకారానికీ వ్యతిరేకంగా,
6) వ్యక్తిగత జీవితం (ప్రైవేట్ లైఫ్) పైన అన్యాయమైన దురాక్రమణకి వ్యతిరేకంగా అలా ప్రజాస్వామ్య పద్ధతుల కోసం,
7) ఆయుధాలకి వ్యతిరేకంగా, సత్యాగ్రహం కోసం

# మలి ముద్రణకి ప్రకాశకుల పలుకు

విద్యార్థి దశలో కాంగ్రెస్, కమ్యూనిస్ట్ పార్టీల ప్రసంగాలు వింటూ ఆ రెంటికంటే మంచి పార్టీకోసం వెతుక్కుంటున్న సమయంలో మా వూరి సోషలిస్టు మిత్రులు లోక్‌నాయక్ జయప్రకాశ్‌నారాయణ్ రాసిన "వై సోషలిజం?" అనే పుస్తకాన్నిచ్చారు. ఆ ప్రభావంతో 1953లోనే ప్రజా సోషలిస్టు పార్టీ సభ్యుడినయ్యాను. తరువాత రెండు సంవత్సరాలకి డా॥ రామమనోహర్ లోహియాను ప్రత్యక్షంగా కలవడం నా భావాల్ని నిర్దేశించింది.

1975లో ఎమర్జెన్సీ విరుచుకుపడి దేశవ్యాప్తంగా ఆలోచనాపరులంతా కటకటాల్లోకి వెళ్ళవలసి వచ్చింది. అప్పుడే యు.ఎన్.ఒ. అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా ప్రకటించింది. ఆ సమయంలో అజ్ఞాత జీవితం గడుపుతున్న నేను మహిళా సమస్యలపై ఒక సంచికను ప్రచురించి, ప్రముఖ కవి పఠాభి భార్య స్నేహలతారెడ్డి చేతుల మీదుగా ఆవిష్కరించాలనుకున్నాను.

ఇంతలో ఎమర్జెన్సీ విషజ్వాలలకి స్నేహలతారెడ్డి ఆహుతవడంతో ఆ సంచికను ఆమె నివాళి రచనలతో కూడిన సంస్మరణా సంకలనంగా ప్రచురించాల్సి వచ్చింది. వ్యాపార దృక్పథం గల ప్రచురణాసంస్థలేవీ దాన్ని ముద్రించడానికి ముందుకు రాకపోవడంతో సోషలిస్టు మిత్రులతో 1977లో 'లోహియా విజ్ఞాన సమితి'ని స్థాపించాను. జనతా ప్రభుత్వ కేంద్రమంత్రులైన జార్జి ఫెర్నాండెజ్, మధూ దండావతె గుంటూరు, విజయవాడలలో సమితిని ప్రారంభోత్సవం చేశారు.

అనంతరం మహిళా సమస్యలపై నేను సేకరించిన వ్యాసాలు, స్నేహలతారెడ్డి సంస్మరణ వ్యాసాలతో ప్రచురించిన సావనీర్‌ను, లోహియా విజ్ఞానసమితి ఆధ్వర్యంలోనే జనతాపార్టీ పార్లమెంటు సభ్యురాలైన మృణాల్ గోరే ఆవిష్కరించారు. ఆ కార్యక్రమంలో ప్రమీలా దండావతేగారు కూడా పాల్గొన్నారు. తరువాత 'ఇతిహాస చక్రం' పేరుతో లోహియా 'వీల్ ఆఫ్ హిస్టరీ' రచనానువాదాన్ని అలాగే జార్జిఫెర్నాండెజ్ 'బరోడా డైనమైట్' కేసు పుస్తకాన్ని ప్రచురించడం జరిగింది.

చిత్రమేమిటంటే ఇంటర్మీడియెట్‌లో ప్రథమ రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ రచించిన 'చంపారన్' ఉపవాచకంగా ఉండేది. నా యువ హృదయంపై ఆనాడే

రైతు ఉద్యమం చెరిగిపోని ముద్రవేసింది. ఆ స్ఫూర్తితోనే మళ్ళీ ఇన్నేళ్ళ తర్వాత చంపారన్ శతవార్షికోత్సవ సందర్భంగా ఒక సంకలన గ్రంథాన్ని పునర్ముద్రించడం జరుగుతోంది.

నిజానికి శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురంలో 3-7-1937న గౌతు లచ్చన్న, కొమ్మారెడ్డి సత్యనారాయణ, చలసాని వాసుదేవరావుల ఆధ్వర్యంలో ఆచార్య ఎన్.జి.రంగా జెండావూపి రైతు సమస్యలపై ప్రారంభించిన పాదయాత్ర మహత్తరమైనది. అక్షరాల నాలుగులక్షల యాభైవేలమంది అన్నదాతలు, దాదాపు తొమ్మిది నెలలు 1,512 మైళ్ళు, 25,000లకు పైబడి సేకరించిన సంతకాలు, 800 పైచిలుకు విజ్ఞాపనలు అందుకుని రాజాజీ ప్రభుత్వ నేతృత్వంలో వున్న మద్రాస్ స్టేట్ అసెంబ్లీకి 27-3-1938న చేరుకుని నాటి స్పీకర్ బులుసు సాంబమూర్తిగారికి ఆ విజ్ఞాపనా పత్రాలన్నింటిని అందించడం అపూర్వ ఘట్టం. 1. రైతుల ఋణమాఫీ, 2. తక్కువ వడ్డీకే రైతులకు రుణాలు 3. రుణం తీర్చలేని కారణంగా రైతుల్ని నిర్బంధించడం నేరాలు మోపి అరెస్టు చేయడం మొదలైన వాటిపై ఖండన 4. రైతుకూలీలందరికీ నిర్దిష్టమైన చట్టబద్ధ కనీస వేతనాలు ... మొదలైన డిమాండులను ఆనాడు పాలకుల ముందుంచడం జరిగింది. ఈనాటికీ అవి అలాగే వున్నాయి. ఈ మధ్య దేశంలోని రాష్ట్రాలన్నిటి నుండి తరలి వచ్చిన రైతులు దేశ రాజధాని నగరంలో లక్షల సంఖ్యలో గుమిగూడి చారిత్రక నిరసన వ్యక్తం చేయగా కనీసం వార్తల రూపంలో కూడా ప్రజలకి సమాచారం ఇవ్వని ప్రసార మాధ్యమాల పిరికితనమే నడుస్తున్న నియంతృత్వానికి తిరుగులేని సంకేతం.

స్వాతంత్ర్యం తరువాత ఈ దుస్థితి మరింత పెరిగి రైతుల ఆత్మహత్యలకు దారితీస్తోంది. ప్రభుత్వాలమాట అటుంచి, పౌరసమాజం, యువత ఈరోజు అన్నదాతల గురించి ఆలోచించే పరిస్థితి కనిపించడం లేదు. ఇలాంటి క్లిష్ట సమయంలో రైతు తరఫున నినదించే నిజాయితీతో కూడిన పోరాటాల అవసరం ఎంతైనా వుంది. ఈ గ్రంథం ఎంతోకొంత ఆ పాత్రను నిర్వహిస్తుందనే నమ్మకంతో మరోసారి మీ ముందుకిలా తీసుకొస్తున్నాం.

**రావెల సోమయ్య**

కన్వీనర్,

లోహియా విజ్ఞాన సమితి

# రెండో ముద్రణకి ముందుమాట

**- గౌరవ్**

కొన్ని సందర్భాలంతే, జీవితంలో ఎప్పటికీ సజీవంగా ఉండిపోతాయి. విత్తులుగా పడిన ప్రతిచోటా చిత్రమైన కాంతిని వెదజల్లుతూ సరికొత్త ఆలోచనలుగా మొలకెత్తడానికి ప్రయత్నిస్తుంటాయి. చరిత్రలో చంపారన్ అటువంటి సందర్భానికి ప్రారంభమయితే, నేటి రైతు ఉద్యమాలు దానికి కొనసాగింపు. ఆ సందర్భ సృష్టికర్త గాంధీ అయితే అక్కడి చైతన్యాన్ని రగిల్చింది ఒక చిత్రమైన సరికొత్త వెలుగు, దాని పేరే సత్యాగ్రహం.[1]

కొన్ని పదాల్ని వల్లించడానికి నోరూ, లిఖించడానికి చెయ్యీ ఉంటే చాలు, కానీ పాటించడానికి జీవితాంత శక్తి కావాలి. సత్యాన్ని గ్రహించడానికీ, గ్రహించిన దానిని ఒక దృక్పథంగా పాటించడానికి చాలా ధైర్యం కావాలి. ఎంత ధైర్యమంటే, **"ఎవరయినా నన్ను కాలిస్తే ఆ బులేట్ నా శరీరంలోకి దూసుకుపోయినప్పుడు నేను గావుకేక పెట్టకుండా నా దేవుడి పేరుని స్మరిస్తూ నా చివరి శ్వాస వదల గలిగినప్పుడు..."** అని ప్రసంగించిన 20 గంటల్లో బుల్లెట్లను ఎదుర్కొని 'హే రామ్' అని నినదించ గలిగినంత ధైర్యం కావాలి.[2]

గాంధీ దేవుడు రాముడు, అందరూ అనుకునే పురాణ పురుషుడో, ఇతర మతస్తుల్ని అమానవీయంగా చంపే ప్రలాప రుద్రుడో కాదు. గాంధి దేవుడు సత్యనిష్టుడు. గాంధి దేవుడు దరిద్రనారాయణుడు. గాంధీ దేవుడు సకల జన సమానుడు. ఈ దేశంలో ప్రతి దేవుడూ రెండు పాత్రలు పోషిస్తారు. మతోన్మాదుల చేతల్లో, రాజకీయ నాయకుల మాటల్లో, ధనవంతుల కోసం ఖరీదయిన విలాసవంత గుళ్ళలో కొలువయిన కొందరి దేవుళ్ళూ, మానవత్వపు ఛాయల్లో, మనుషుల కోసం చేసే ప్రతి పనిలో, గరీబు వాడల్లో నివసించే మామూలు దైవాలు అందరి దేవుళ్ళూ.

గాంధీని జీవితాంతం సత్యాన్వేషణకు ప్రేరేపించి పదిమందికి మంచి చేయడానికి మించిన ఆధ్యాత్మికత మరేదీ లేదని స్ఫూర్తినిచ్చిన రాముడూ, అదే గాంధీ మానవతను జీర్ణించుకునే చేవలేక సంకుచితత్వంతో కళ్ళు మూసుకుపోయి ఆఖరికి గాంధీని హత్య చేయడానికి కారణమయిన ఉన్మాది ఉద్రేకంతో కొలిచే రాముడూ కచ్చితంగా ఒకరు కాదు.[3]

గాంధీతో మొదలయిన ఆధునిక మతోన్మాద కాష్టమింకా ఈ దేశంలో ఆరలేదు. నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, కల్బుర్గి, గౌరీలంకేశ్వర్ దాకా ఇంకా అది కొనసాగుతూనే ఉంది. నాడు గాంధి హత్య కేవలం వ్యక్తిని అంతమొందించడం కాదనీ భావజాలాన్ని రూపుమాపే కుట్రలో భాగమనే విషయం ఆలస్యంగా తెలిసొచ్చింది. ఈ మూడు సం॥రాల్లో హత్య కావించబడ్డ నలుగురూ ఒక రకంగా నాలుగు భిన్న భావజాల స్రవంతులకి చెందిన వాళ్ళు. ఒక డాక్టర్‌గా సమాజంలోని మూఢనమ్మకాలకి వ్యతిరేకంగా చికిత్స చేయడానికి సిద్ధపడిన దభోల్కర్, ఒక సిద్ధాంతానికి కట్టుబడి విస్తృతంగా పరిశోధిస్తున్న పన్సారే, విశ్వవిద్యాలయాచార్యుడిగా విద్యారంగం మొదలుకుని వివిధ విజ్ఞానయుత అంశాల్లో లోతైన రచనలు చేసిన కల్బుర్గి, ప్రజాహిత పాత్రికేయురాలిగా పనిచేస్తున్న గౌరిలంకేష్... ఇలా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల వైపు నిలబడ్డ వారందర్ని భౌతికంగా నిర్మూలించి తృప్తి చెందే హంతక మూకలు నాటికంటే నేడే మరింత బలం పుంజుకుని పెట్రేగిపోతున్నాయి. సమాజాన్ని మంచి మార్గంలో ప్రభావితం చేయడానికి పూనుకున్న వ్యక్తుల్ని ఇంతటి స్థాయిలో ఘోరంగా హత్య చేయడం, స్వాతంత్ర్యానంతరం పౌర సమాజంలో ఇంత నిస్సిగ్గుగా పాలకగణం ఎప్పుడూ చేసినట్టు లేదు. మతోన్మాదానికి అధికారహంకారం తోడైతే తలెత్తే దుష్పరిమాణాలకి నేటి వ్యవస్థ రూపం ఒక పరాకాష్ట.

అయితే దానిని ఎదుర్కొనే యత్నాలు జరగాల్సినంతగా జరగకపోవడంతోబాటు విభేదాలనేవి ఆరోగ్యకర సంవాదాలుగా కాక శత్రుపూరిత సంఘర్షణలుగా తలెత్తే స్థితి అన్ని ఉద్యమ శ్రేణుల్లో కనిపిస్తుండటం ప్రజాకార్యకర్తలకు మింగుడు పడని ఒక పరాభవం. నిజానికి 1855-56 నాటికే బెంగాల్ ప్రాంతంలో సంతాల్ రైతాంగ తిరుగుబాటు భూస్వామ్య తరగతుల్లో సంచలనం కలిగించింది. సింగభమ్ చోటానాగ్‌పూర్‌లలో జరిగిన హొూస్‌ల తిరుగుబాటు, మాన్‌భమ్, భీర్భూమ్‌లలో జరిగిన చువార్ల తిరుగుబాటు, ఖాశీల తిరుగుబాటు, రాజమహల్ ప్రాంత సంతాల్ తిరుగుబాట్లన్నీ రైతాంగ పోరాటాలే[4]. చంపారన్ నాటికే ప్రజల్లో ఎంతో కొంత చైతన్యం నింపడానికి ఇవి దోహదం చేసాయి. చంపారన్ ఎందుకు ప్రత్యేకమయిందనంటే వినూత్న రీతిలో రూపొందింది కాబట్టీ, కొత్త రూపంలో ఉద్యమానికి నాంది పలికింది కాబట్టి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే 'చంపారన్' కి 'సత్యాగ్రహం' తోడైంది కాబట్టి.

అయితే, ఇక్కడ విషయం కేవలం చంపారన్ మాత్రమే కాదు, అంతకు మించి. మార్క్సుని ఆర్థిక సమానత్వానికీ, అంబేద్కర్‌ని దళిత బహుజన రాజ్యాధికారానికీ, గాంధీని అహింసకి పరిమితం చేయడం వారికి అన్యాయం చేయడమే. నా దృష్టిలో వారందరిదీ సిద్ధాంతాల్ని మించిన మానవతా దృక్పథం. సంకుచితత్వాల్ని విడనాడిన బహుముఖ విశాల పార్శ్వం. గాంధీజీతో ఎంతలా విభేదించినప్పటికీ ఆయన మానవతా కోణాన్ని అర్థం చేసుకున్న ఏ ఒక్కరూ వ్యక్తిగతంగా ఆయన్ని శత్రువుగా చూడకపోగా భారతదేశపు అరుదయిన బిడ్డగా గ్రహించి గౌరవించారు కూడా.[5]

గాంధీజీ నిర్మాణాత్మక కార్యాచరణ ఎంత విశిష్టమయినదో అంతే విస్తృతమయినది. యథాతథ దృష్టితో చూసే విమర్శకులకే కాని ఆయన ఆరాధ్యులకో, వ్యతిరేకులకో అదర్థం కాదు. గాంధీ దృక్కోణం నుంచే ఆర్థిక అంశాల్లో జె.సి. కుమారప్ప, సాంకేతికతలో ఈ. ఎఫ్. షుమాకర్, వ్యవసాయంలో ఎన్.జి. రంగా, భూదానోద్యమంలో వినోభా, సోషలిజానికి నెహ్రూ, జె.పి., లోహియా, సాంస్కృతికోద్యమానికి బోస్, పటేల్, మత సంస్కరణకి రాజగోపాలాచారి, మత సామరస్యానికి గఫార్‌ఖాన్ ఆస్తికత్వానికి అరవిందుడు, రమణమహర్షి, నాస్తికత్వానికి గోరా, మితవాద కమ్యూనిజానికి సుందరయ్య అతివాద ఆత్మగౌరవోద్యమానికి పెరియార్... ఇలా చెప్పుకుంటూ పోతే గాంధి ప్రభావం పడని చోటు ఆ కాలంలో ఏదీ లేదు.[6]

నిత్య చైతన్యశీలిగా జీవించినంతకాలం రగిలిన ఒక అద్వితీయ మానవుడాయిన. మహాత్మా అనే పిలుపుకి అర్హుడ్ని కానని జనానికి చెప్పడానికే ప్రత్యేకంగా విలేఖరుల సమావేశం పెట్టినవాడు, నోట్లమీద తన బొమ్మను ముద్రించడం చూసి ముచ్చటపడ్డమో, అసెంబ్లీ ముందు ఇంతెత్తు విగ్రహం చూసి ఉబ్బితబ్బిబ్బై పోవడమో ఆయన పట్ల ఊహించలేం. స్వార్థం కోసం రాజకీయ దళారులు వేసే వేషాలకి గాంధీజీని ద్వేషించడం సరికాదనే స్పృహ ఈరోజు అవసరం. ప్రపంచం మొత్తాన్ని కదిలించిన రష్యన్ విప్లవం కంటే ముందే, భారతదేశంలో చంపారన్ రైతాంగ పోరాటం సమతా వ్యవస్థ స్థాపనకి ఒక ప్రత్నామ్నాయ మార్గం చూపింది. అంగీకారాలు, విబేధాల సంగతెలా ఉన్నా విద్యావ్యవస్థ మొదలుకుని వ్యవసాయ సంక్షోభం దాకా విద్యార్థులు, రైతులు విపరీతంగా ఆత్మహత్యలకి పాల్పడుతున్న ప్రస్తుత పరిస్థితుల్లో ప్రతి బలవన్మరణానికి బాధ్యత వహించే పనిని సమాజం తలకెత్తుకుని మౌనాన్ని వీడాలంటే గతంలో ప్రశ్నించిన ప్రతి ధిక్కార స్వరాన్ని పునర్నిర్మించుకుని తీరాలి.[7]

అందులో భాగంగా వెలువడిన ఈ గ్రంథం మొదటి ప్రచురణ ప్రతులు వారం రోజుల్లోనే మొత్తం అయిపోయాయి. 14/08/2017న శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం, హైద్రాబాద్‌లో తెలంగాణ రైతు సంక్షేమ సభ కన్వీనర్ రిటైర్డ్ జస్టిస్ బి. చంద్రకుమార్ అధ్యక్షతన, తెలంగాణ రాష్ట్ర హోమ్ శాఖామాత్యులు నాయిని నర్సింహారెడ్డిగారు ముఖ్య అతిథిగా, సెంటర్ ఫర్ సస్‌టెయినబుల్ అగ్రికల్చర్ స్థాపకులు డా॥ జి.వి. రామాంజనేయులు, ప్రొఫెసర్ జి.ఆర్.ఎస్.రావు మొదలగువారు వక్తలుగా ఈ గ్రంథాన్ని ఆవిష్కరించడం జరిగింది. గ్రంథానికి, ముఖ్యంగా నా మొదటి వ్యాసానికి అపూర్వమయిన స్పందన వచ్చింది. ప్రధాన దినపత్రికలు మొదలుకుని ఉద్యమ భావజాల పత్రికలు సమీక్షలు ప్రచురించాయి. ప్రముఖులు అనేకమంది దార్శనికంగా వారి విలువయిన అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. అలా మా దృష్టికి వచ్చిన వాటన్నింటినీ ఈ గ్రంథానికి అనుబంధంగా చేర్చాము. వారందరికీ మరొక్కసారి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

నా కృషి రవంతే అయినా విభిన్న కారణాల వలన ఈ గ్రంథం ఈరోజు అవసరమని ఎంతోమంది ఆలోచనాపరులు ప్రోత్సహించారు. మరెంతోమంది ఆరోగ్యకరమయిన సంవాదానికి దారితీసే ఈ ప్రయత్నాన్ని హర్షిస్తూ నన్ను అభినందించారు. స్తబ్దత రాజ్యమేలుతున్న చోట సంధించబడే ప్రతీ ప్రశ్న చరిత్రలో భాగమై తీరుతుంది. నిర్లిప్తతని ఛేధించడానికి ఎంతో కొంత చేదోడుగా నిలుస్తుంది. మౌనాన్ని మధించి ఆవిష్కరించబోయే కొత్త చర్చలకి మౌలిక భూమిక సిద్ధం చేస్తుంది. ఆ పాత్రను ఈ దేశంలో గాంధీ ఎంతో కొంత పోషించాడని తెలపడం, ఈనాటి తరాలకు త్యాగాల చరితను అందించడం ఈరోజు సామాజిక హితులందరి ఉమ్మడి విధి. దాన్ని గుర్తించి కొనసాగించడంలో భాగమే ఈ రెండో ముద్రణకి ప్రేరణ. అందుకోసం మరోసారి ముందడుగేసిన మిత్రులు రావెల సోమయ్య, అరుణ దంపతులకి, లోహియా విజ్ఞాన సమితికి ప్రత్యేక ధన్యవాదాలు.



**ఫుట్ నోట్స్, వివరణలు :**

1. ఎవరొప్పుకున్నా లేకున్నా గాంధీజీ ప్రపంచానికి ఇచ్చిన గొప్ప ఆయుధం అహింసాత్మక సత్యాగ్రహం. ఈనాటికి మాత్రమే కాక ఏనాటికయినా మానవాళి నాగరిక నిరసనకి అనుసరించాల్సిన మార్గం. Revolutionary Communist Party of India (RCPI) లో కార్యదర్శిగా ఉండి పర్యావరణ ఉద్యమాలవైపు మనసోబు పుకువోకా "గడ్డిపరకతో విప్లవం" చదివి ఆకర్షితుడై తర్వాత గాంధీ సిద్ధాంతాల్ని అధ్యయనం చేసిన పన్నాలాల్‌దాస్‌గుప్తా జయప్రకాష్ నారాయణ్ సహకారంతో Tagore Society for Rural Development ని స్థాపించి బీహార్, బెంగాల్, జార్ఖండ్, ఒడిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లో క్షేత్రస్థాయిలో పనిచేసారు. 1934లో సుసేన్ ముఖోపాధ్యాయ స్థాపించిన 'అమర్ కుటీర్'ని పన్నాలాల్ 1978లో తిరిగి పునరుద్ధరించారు. అలీపూర్ సెంట్రల్ జైల్లో ఖైదీగా ఉండగా 'గాంధీ గవేషణ' పేరుతో రచించిన ఉద్గ్రంథం విశిష్టమైంది. గాంధేయవాద దృక్పథానికి సంబంధించి ముఖ్యమైన గ్రంథాల్లో అదొకటి. ఆంగ్లంలోకి టి.వి. సుబ్రహ్మణ్యన్ చేత Revolutionary Gandhi గా అనువదించబడిన ఈ పుస్తకంలో సత్యాగ్రహం గూర్చి చర్చిస్తూ Satyagraha, Satyagraha Vs Duragraha, అనే రెండు భాగాలున్నాయి. వివరాలకు చూడు: Revolutionary Gandhi by Pannalal Das Gupta, Translated by K.V. Subrahmanyan, Published by Earth Care Books, Kolkata - 2017. అంతేకాదు. సత్యాగ్రహుల కోసం ప్రత్యేకంగా ప్రచురించిన ఏకంగా ఒక కరదీపికే ఉంది. చూడు : Hand Book for Satyagrahis by Narayan Desai, Published by Gandhi Peace Foundation, New Delhi, Movement for a New Society, Philadelphia - 1980.

2. గాంధీజి మరణానికి సంబంధించి వివాదాలు లేవదీసి వారి స్వప్రయోజనాలు నెరవేర్చుకోవడం మతోన్మాదుల నైజం. జనవరి 12న ఢిల్లీలో ప్రసంగిస్తూ "Death for me would be a glorious deliverance rather than that I should be a helpless witness of the destruction of India, Hinduism, Sikkism and Islam.." అన్న గాంధీజీ, మరుసటి రోజు ప్రసంగిస్తూ (జనవరి, 13) "In the name of religion we have become irreligious." అని వాపోయాడు. అంతేకాదు, "India should become a country where everyone's life and property are safe. Only then will India progress" అంటాడు. గాంధీజీ హత్యకు సంబంధించిన వివరాలకు, చూడు : Assassination of Gandhi, Facts Vs. Falsehood, by Chunibhai Vaidya, Translated by Ramesh Dave, Published by Sarva Seva Sangh, Rajghat, Varanasi - 2015 గాంధీ హత్య విషయంలో జరుగుతున్న వివాదాల్ని ఖండిస్తూ ఆయన మునిమనవడు తుషార్ గాంధీ **"గాంధీ హత్యకు సంబంధించిన వాస్తవాలు స్పష్టంగా ఉన్నాయి. సంకుచిత ఆదర్శాలకు కట్టుబడిన వారికి అవి యిబ్బంది కలిగిస్తున్నాయి.**

**చరిత్ర తిరిగి రాయగల సామర్థ్యం అధికారం తమకు వున్నాయని ఇప్పుడు వారు భావిస్తున్నారు. అందుకే సత్యం స్థానంలో తమ ప్రయోజనాలకు అనుకూలంగా వుండే కల్పనలను ప్రతిష్టించడానికి ప్రయత్నిస్తున్నారు"** అంటాడు. చూడు : 'హేరామ్! సత్యం హతం!!', తుషార్ గాంధి, సెప్టెంబర్ 15, ఆదివారం, 2017 ఆంధ్రజ్యోతి పత్రిక.

3. గాంధీది మానవీయమైన ఆధ్యాత్మికత, సర్వమానవాళి శుభాన్ని కాంక్షించే ఈశ్వరుడే ఆయన ఆరాధ్య దైవం. గాంధీ లౌకికమైన మత సామరస్యతను తట్టుకోలేకనే మతోన్మాద మూకలు ఆయన్ని ఘోరంగా హత్యచేసాయి. ఈరోజు అవే మొసలి కన్నీరు కారుస్తున్నాయి. చూడు; Sabko Sanmatide Bhagwan, RSS Ideology greatest danger for the country, by L.S. Herdenia, Amarshri Publishing, Bhopal - 2014, P-29-33.

4. ఇవేకాక గిరిజనులు, భిల్లుల, కోలీలు మొదలగువారు కూడా రైతాంగ ఉద్యమాలు చంపారన్ కంటే ముందే చేసారు. వివరాలకు చూడు; భారతదేశంలో రైతాంగ ఉద్యమాలు (1850–1950), రచయిత : రమేష్ పన్నీరు, చరిత్ర పరిశోధకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం, సంపాదకులు : డా. పి. ప్రసంగి, ప్రొఫెసర్, ఓ.యు, ప్రచురణ : తెలుగు అకాడమి, హైదరాబాదు – 2007.

5. జీవితాంతం గాంధీజీని నిష్కర్షగా విమర్శించిన ఎమ్మెన్‌రాయ్ కోల్‌కత్తాలో ఏదో సమావేశంలో ఉండగా గాంధీ హత్య కావించబడ్డారనే వార్తందింది. రాయ్ లేచి నిలబడి సభను ఆపి **"మిత్రులారా గొప్ప దుర్ఘటన సంభవించింది. ఈ రోజు దేశం తన అత్యుత్తమ బిడ్డను కోల్పోయింది."** అంటూ ప్రకటించాడట. వ్లాదిమిర్ లియోన్ దర్శకత్వం వహించి రాయ్ జీవితంపై ప్రపంచ దేశాలన్నీ పర్యటించి 2006, ఫిబ్రవరిలో The Comintern Brahmin పేరుతో ఇంగ్లీష్, రష్యన్, ఫ్రెంచ్, స్పానిష్ భాషల్లో అద్భుతమయిన డాక్యుమెంటరీ చేసాడు. అందులో 3వ భాగంలో (మొత్తం నాలుగు భాగాలు) డెహ్రాడూన్‌లో రాడికల్ డెమోక్రటిక్ పార్టీ ప్రముఖ రాయిస్టు, రాయ్ 1936లో జైలు నుండి విడుదలయ్యాక అత్యంత సన్నిహితుడు, ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ ఇంటి యజమాని ఎస్.ఎన్. పురీతో సంభాషణ ఉంటుంది. దీంట్లో పై సంఘటనని ఎస్.ఎన్. పురీగారు పేర్కొవడమే కాక ఏదోక సందర్భంలో కుర్రతనంతో 'గాంధీని నిర్మూలిస్తే పీడా పోతుందని' తానన్న మాటతో రాయ్ బెబ్బులిలా లేచి అగ్గిమీద గుగ్గిలమై తనమీద విరుచుకుపడిన ఉదంతాన్ని కూడా గుర్తు చేసుకున్నాడు. ఎస్.ఎన్ పూరీ చెప్పిన మాటలకు ప్రత్యేక ఆధారాలు అవసరం లేదు. ఆయనో ప్రామాణిక వ్యక్తి. వివరాలకు చూడు, The comintern Brahmin (The untold Story of M.N. Roy), Political Biography of an unknown Bengali revolutionary, by - V. Leon. ఈ చిత్రానికి సంబంధించిన ఆసక్తికర వ్యాసాన్ని అజోయ్ ఆశీర్వాద్ మహాప్రశస్త

రాశారు. అందులో స్థానికపాలన గురించి రాయ్ సూత్రీకరణలు గాంధీ గ్రామపాలనకి విరుద్ధమైనవి కాదంటారు. "Despite miniltently differing with Gandhi and his support for non-violence and Hindu treditions and religious ideals, Roy's political programme of forming peoples committees in villages did not differ from Gandhi's local governence programme..." అంటాడు. వివరాలకు చూడు : Man of paradoxes, by Ajoy Ashirwad Mahaprasshasta, Frontline, April 19, 2013. 1969లో జన్మించిన లియోన్ పారిస్ విశ్వవిద్యాలయ పట్టభద్రుడు, నటుడు, నిర్మాత, దర్శకుడు. గాంధీ, రాయ్‌ల జీవితాలపై చలనచిత్రాలు నిర్మించిన మొదటి వారిరువురూ విదేశీయులే కావడం విచిత్రం. మరో విషయమేమిటంటే, నేను వ్యక్తిగతంగా మొన్నీమధ్యనే డెహ్రాడూన్‌లో రాయ్‌లు నివసించిన రినైజాన్స్ ఇనిస్టిట్యూట్‌కి వెళ్ళాను. అక్కడ రాయ్‌కి సంబంధించి గుర్తులేవీ లేకపోగా, ప్రస్తుతం పూరీగారి కుమార్తె నివసిస్తున్నది. ఆవిడకి రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమంపై సదాభిప్రాయం లేదు సరికదా అక్రమంగా కోర్టులు చుట్టూ తిప్పుతున్నారని మండి పడుతోంది కూడా.

6. ఈ కాలంలో కూడా కొద్దోగొప్పో గాంధేయ మార్గాన్ని అనుసరిస్తున్నవారు లేకపోలేదు. 22-10-17 ఆదివారం విశాఖపట్నంలోని పౌర గ్రంథాలయంలో గ్లోబల్ నెట్‌వర్క్ ఆధ్వర్యంలో "గాంధేయవాదం-ప్రస్తుత ప్రపంచం" (Gandhism and present world) అనే అంశంపై సదస్సు జరిగింది. అమెరికన్ గాంధీగా పేరొంది ప్రపంచంలోని అనేక దేశాల్లో యుద్ధాలకి, న్యూక్లియర్ అణ్వాయుధాలకి వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్న బెర్నీ మేయర్ ముఖ్య అతిథిగా పాల్గొన్న ఆ కార్యక్రమంలో గాంధీవాద ప్రభావం గూర్చి ఆయన ప్రసంగించారు. నేను కూడా పాల్గొన్నాను.

7. గాంధీజీ 61వ వర్ధంతి సందర్భంగా ప్రముఖ పార్లమెంటేరియన్, మేధావి, విద్యావేత్త, న్యాయవాది, పాత్రికేయుడు డా॥ సచ్చిదానంద సిన్హా గాంధీని గురించి అద్భుతమయిన వ్యాసం రాశారు. అందులో ఆయన గాంధీని బుద్ధుడు, జీసస్‌ల సరసన చేర్చారు. వివరాలకు, చూడు : Mahatma Gandhi Tribute by Dr. Sachchidananda Sinha, Published by Gandhi Sangrahalaya, Patna-2009. ఇలాగే అంబేద్కర్‌ని జీసెస్, మహ్మద్‌లతో పోలుస్తూ సామాజికవేత్త కంచె ఐలయ్య షెప్పర్డ్ కూడా కొద్ది సంవత్సరాల క్రితం ఏదో పత్రికలో వ్యాసం రాసినట్లు గుర్తు.



# మా మాట

ఇది చంపారన్ సత్యాగ్రహ శతవార్షికోత్సవ సంవత్సరం. మహత్తర రష్యన్ విప్లవం కంటే ముందే చంపారన్ ఉద్యమం జరిగింది. ఈ ఉద్యమాన్ని నడిపించిన నాయకుడు గాంధీ. నిజానికి, 1916లో దక్షిణాఫ్రికా నుండి వచ్చిన తర్వాత బెనారస్ విశ్వవిద్యాలయంలో గాంధీజీ ఇచ్చిన ప్రప్రథమ ఉపన్యాసంలోనే ఈ దేశపు రైతాంగానికి జరుగుతున్న అన్యాయాలని తీవ్రస్వరంతో ప్రశ్నించాడు. ఆయన వాగ్ధాటికి బిత్తరపోయిన అనిబిసెంట్ సహా ఎంతోమంది నాయకులు సభను మధ్యలోనే ముగించారు. అప్పటినుంచి గాంధీజీ ప్రజల్ని చైతన్యవంతం చేయాలంటే వారిముందు పౌరుష పదజాలన్ని వాడకూడదనే నిర్ణయం తీసుకున్నాడు. శాంతియుత పోరాటానికి ఉపయోగపడే రెండు అద్భుతమైన అద్వితీయ ఆయుధాలని కనుగొన్నాడు. అవే సత్యం, అహింస.

వాటి సహకారంతో గాంధీజీ సాధించిన అపురూప విజయమే మొట్టమొదటి చంపారన్ సత్యాగ్రహం. ఒక సమస్య దిశగా ప్రజల్ని పోరాటానికి సన్నద్ధుల్ని చేయడానికి సుదీర్ఘమైన దీక్ష, పట్టుదల అవసరమని నిరూపించిన ఉద్యమమది.

70 సంవత్సరాల స్వాతంత్ర్య భారతదేశంలో వ్యవసాయ, ఖాదీ, చేనేత, గ్రామీణోత్పత్తి రంగాలన్నీ పాలక విధానాల పుణ్యమా అని కుంటుపడ్డాయి. ప్రకృతి సహజమైన ఉత్పత్తులు చులకనగా చూడబడుతుంటే, భూగోళాన్ని నాశనం చేసే పారిశ్రామికోత్పత్తులు ప్రభుత్వాల చేత ప్రజలపై రుద్దబడుతున్నాయి.

దిక్కులేని అన్నదాతలు వారి గోడు వినేనాథుడే కనబడక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. యాంత్రికమైన స్తబ్దత నాగరికతగా భ్రమిస్తోన్న నేటి యువతరానికి మానవీయ స్పృహతోకూడిన ఒక నిరసన అవసరమని తెలపడమే మా ఉద్దేశం.

అందులో భాగంగా జరుగుతున్న అన్యాయ్యాన్ని రైతుల పక్షాన ప్రశ్నించడానికి ఏ ఒక్క స్వరం సిద్ధమైనా ఈ అక్షరాల కృషి ఫలించినట్లే. అడిగిన వెంటనే ఎన్నో పనుల ఒత్తిళ్ళమధ్య వుండికూడా ముందుమాట రాసిచ్చిన పెద్దలు, చిరకాల మిత్రులు ఎబికె గారికి, అనువాదకుడు గౌరవ్‌కి ప్రత్యేక ధన్యవాదాలు.

**–సంకలనకర్తలు**

పి. జనార్దన రెడ్డి (మాజీ శాసనసభ్యులు)

రావెల సోమయ్య

# రైతు సత్యాగ్రహ పోరాటాల శత సంవత్సర సంరంభం

**- డా॥ ఎ.బి.కె.ప్రసాద్**

"ముందుతరాల వారు యిలాంటి మనిషొకరు ఈ భూమ్మీద నడయాడాడా! అని సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యే అవకాశం వుంది." అని ప్రపంచ ప్రఖ్యాత అణువిజ్ఞాన భౌతిక శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ అన్నాడంటే ఆశ్చర్యమేముంది ! ఆ వ్యక్తే మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ. ఆయనే భారత సాతంత్ర్యోద్యమ పితామహులలో అగ్రగణ్యుడుగా 'మహాత్మా' అని పలువురు ఆప్యాయంగా గౌరవ సూచకంగా ప్రేమతో పిలుచుకునే గాంధీజీ ! ఈ ఏడాదితో భారతదేశానికి అశేష త్యాగాలతో స్వాతంత్ర్యం సిద్ధించి 70 సంవత్సరాలు నిండుతుండగా, బ్రిటీష్ వలస సామ్రాజ్యవాద పాలనా దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా గాంధీజీ నాయకత్వంలో ప్రారంభమై మహోద్యమంగా, తొలి రైతాంగపోరాటంగా సాగిన చంపారన్ (బీహార్) సత్యాగ్రహానికి ఈ ఏడాదితోనే వంద సంవత్సరాలు (1917 -2017) పూర్తి కావొస్తాయి. వందేళ్ళనాడు చంపారన్‌లో నీలిమందు రైతుల దుస్థితికి వ్యతిరేకంగా ఒక చారిత్రక మహోద్యమంగా గాంధీజీ ప్రారంభించిన సత్యాగ్రహం బీహార్ సరిహద్దులు దాటి యావద్భారతాన్నీ కదిలించి, రానున్నకాలంలో దేశ స్వాతంత్ర్యానంతరం కూడా రైతాంగం, ప్రజలు ఎదుర్కొనబోయే ఈతిబాధల్ని గురించి ముందస్తుగానే చేసిన హెచ్చరికగా భావించవచ్చు! దక్షిణాఫ్రికాలో భారతీయుల కడగండ్లు సంవత్సరాల తరబడి కాచివడబోసిన గాంధీ అక్కడి సత్యాగ్రహ అనుభవంతో సాధించిన పాక్షిక విజయాల అనుభవం పూర్వరంగంగా చంపారన్‌లో రైతాంగ విమోచన కోసం పాటుబడిన సత్యాగ్రహానికి పరాయిపాలనలో బాసటగా నిలబడిన ఉద్దండులు బ్రజ్‌కిషోర్ ప్రసాద్, బీహార్ కాంగ్రెసు నాయకుడైన రాజేంద్రప్రసాద్, ఆచార్య కృపలానీ. పస్తులతో, శిస్తులతో బ్రిటీషు పాలనాధికారుల దోపిడితో కృంగి, కునారిల్లిపోతున్న రైతాంగ ప్రజలు గాంధీ ప్రభృతుల అండదండలతో ఆత్మస్థయిర్యాన్ని చిక్కబెట్టుకొని సత్యాగ్రహానికి సన్నద్ధమైన దినాలవి; అది 1916 డిసెంబర్. భారతజాతీయ కాంగ్రెసు సమావేశం లక్నోలో జరగబోతున్న వార్త చంపారన్ ప్రజల చెవినపడింది. అంతే, స్వాతంత్రోద్యమ కాలంలో బ్రిటీషు పాలకుల్ని దేశంనుంచి సాగనంపడానికి 'ఛలో ఢిల్లీ' నినాదం ఎలా ఉద్దీపన

కలిగించిందో – చంపారన్ రైతాంగ ప్రతినిధులు కూడా అదే స్ఫూర్తితో లక్నోవెళ్లి రైతాంగ ప్రజల బాధాల్ని కాంగ్రెసు సమావేశానికి నివేదించారు. ఈ పరిణామం తర్వాత నాటి కాంగ్రెసు కార్యకర్త రాజ్‌కుమార్ శుక్లాను కుదిపుకుదిపింది. అదే అదనుగా ఆ సమయంలో కలకత్తాలో ఉన్న గాంధీజీని వెంటనే చంపారన్ తీసుకుని వచ్చేట్టు రాజ్‌కుమార్‌ను పురమాయించారు. ఈ ప్రయత్న ఫలితమే 1917 ఏప్రిల్‌లో గాంధీజీ చంపారన్ నుంచి చారిత్రక తొలిరైతాంగ ఉద్యమానికి నాంది పలకటం. అప్పటికే శతాబ్దాలుగా వస్త్రాల తయారీ, అద్దకం పరిశ్రమలో ఉపయోగపడే నీలిమందును ఉత్పత్తి చేయడంలో భారతదేశం అగ్రగామిగా ఉంది. ఇది స్థానిక రైతుల శ్రమ ఫలితం. 17వ శతాబ్దానికే వెస్టిండీస్‌లో ఆధునిక పద్ధతుల్లో నీలిమందును ఉత్పత్తి చేయడానికి సిద్ధమయ్యారు. ఎప్పుడైతే బ్రిటీషు సామ్రాజ్యవాదులు బెంగాల్‌ను స్వాధీనం చేసుకున్నారో అప్పటినుంచి వస్త్రాలను తెలుపుచేసేందుకు అద్దకాలలో ఉపయోగించే నీలిమందును ఉత్పత్తిచేసే తోటలు పెంచే పనిని రైతులపై బలవంతంగా రుద్దారు, కానీ రైతుల కష్టార్జితంతో ఉత్పత్తి అయిన నీలిమందును తక్కువరేటుకు తమకు సరఫరా చేయాలనీ బ్రిటీషు తోటల యజమానులు నిర్బంధంచేశారు. ఈ దోపిడి పద్ధతులను గమనిస్తూ వచ్చిన నాటి భారతచరిత్రకారులు, ఇందుకు కర్మసాక్షులుగా ఉన్న పరిశోధకులు, ఆర్థిక నిపుణులలో అగ్రగణ్యులుగా ఖ్యాతికెక్కిన దాదాభాయి నౌరోజీ, ఆర్.సి.దత్ ప్రభృతులు భారతదేశసంపదను బ్రిటీషు పాలకులు ఎలా బ్రిటన్‌కు తరలించుకుపోతున్నారో ఇది దేశ ఆర్థికాభివృద్ధికి ఎంత వినాశకరమైన పరిణామమో వివరించి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడానికి ప్రయత్నించారు. ఇలా దేశసంపద పరాయిదేశాలకు తరలిపోవడాన్ని నౌరోజి "డ్రైన్" అని పేరు పెట్టాడు. అదే "డ్రైన్‌థీరీ"గా చరిత్రకెక్కింది. ("పావర్టీ అండ్ అన్ – బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా"). అలాగే అదే సమయంలో ఆర్.సి.దత్ "బ్రిటిషు పాలనలో భారతదేశ ఆర్థిక వ్యవస్థ చరిత్ర" (హిస్టరీ ఆఫ్ ఇండియా అండర్ బ్రిటీష్ రూల్) అనే గ్రంథంలో బ్రిటన్ దోపిడిని ఎండగట్టాడు! ఆ ఊపులోనే గాంధీజీ "హింద్ స్వరాజ్" గ్రంథం ద్వారా ప్రజల్ని స్వాతంత్ర్యసమరం ఉధృతం కావడానికి తగిన కర్తవ్యబోధ చేశారు. ఈ చరిత్రకు సంబంధించిన విశ్లేషణలను వివిధకోణాల్లోంచి అందించిన తుషార్‌గాంధీ, ఇర్ఫాన్ హబీబ్, జె.బి.కృపలానీల రచనలను యువరచయిత గౌరవ్ చంపారన్ సత్యాగ్రహం శతాబ్ది సంవత్సరానికి ఉడతాభక్తిగా తెలుగువారికి అందించిన స్వేచ్ఛానువాదమే

ప్రస్తుత గ్రంథం. ఇందుకు చిరంజీవి గౌరవ్ అభినందనీయుడు. ఈనాటికి స్వతంత్ర్య భారతపాలకులు రైతాంగ వ్యతిరేక పెట్టుబడిదారి దేశీయ, విదేశీ బహుళజాతి గుత్తకంపెనీల దోపిడిని అనుమతించి కొనసాగిస్తున్నందున చంపారన్ సత్యాగ్రహ మార్గంలో దేశవ్యాప్తంగా పలు రాష్ట్రాల్లో రైతాంగ ఉద్యమాలు కొనసాగుతునే ఉన్నాయి. గత దశాబ్దంకాలంలోనే పాలకుల రైతాంగ వ్యతిరేక విధానాల ఫలితంగా దేశవ్యాప్తంగా 4 లక్షలమంది రైతులు ఆత్మహత్యల పాలయ్యారు! నాడు పరాయిపాలకుల దోపిడి వల్ల రైతాంగం కునారిల్లిపోగా నేడు అవే ప్రజావ్యతిరేక వలస పాలన చట్టాలు కొనసాగడం వల్ల రైతులు, వ్యవసాయ కార్మికులు, వృత్తిపనివార్ల ఆగచాట్లు పెరిగిపోతున్నాయి.

నీలిమందు తోటల పెంపకం పేరిట తెల్లవారు చేసిన దోపిడిని గురించి వెలువడిన తొలిరచన బంధుమిత్ర "నీల్‌దర్పణ్"! ఇలా "ప్లాసీ యుద్ధం"(1757)తో మొదలైన బ్రిటీషువాడి భారతదేశ దోపిడీ, పీడనాభారమంతా దేశ రైతాంగ ప్రజలు, చేతివృత్తులవారు, వ్యవసాయ కార్మికులు, పేదలైన శ్రమజీవులు శతాబ్దాలుగా మోయవలసి వచ్చిందని నేటి యువతరం మర్చిపోరాదు. అదే చంపారన్‌లో గాంధీ సత్యాగ్రహ స్ఫూర్తి 100 సంవత్సరాల తర్వాత కూడా వర్తమాన భారతంలో కొనసాగడానికి కారణం- ఆ స్ఫూర్తితోనే రైతాంగ పోరాటాలు, ఉద్యమాలు అప్పటినుంచి జరుగుతునే ఉన్నాయి. సర్దార్ పటేల్ బార్డోలి రైతాంగ ఉద్యమం, చంపారన్ స్ఫూర్తి ఫలితమే! అన్ని రాష్ట్రాలలో రైతాంగ ఉద్యమాలు జాతీయోద్యమ స్రవంతిలో అంతర్భాగంగానే సాగుతూనే వచ్చాయి. మాప్లా (ముస్లిం రైతాంగం) తిరుగుబాటు మొదలుకొని మద్రాసు ప్రెసిడెన్సీ రైతు ఉద్యమాలు, చీరాల-పేరాల ఉద్యమం, అల్లూరి, కొమరంభీం తిరుగుబాట్లు, శ్రీకాకుళంలోని ఇచ్ఛాపురం నుంచి మద్రాసు వరకు కొమ్మరెడ్డి సత్యనారాయణ, చలసాని వాసుదేవరావుల నాయకత్వాన 1500ల కిలోమీటర్ల మేర జరిగిన ఆంధ్ర రైతాంగ యాత్ర చంపారన్ సత్యాగ్రహ స్ఫూర్తిలో అంతర్భాగంగానే భావించాలి. అలాగే చంపారన్ సత్యాగ్రహం ఫలితంగా బెంబెలెత్తిపోయిన బ్రిటిషు పాలకులు ఒక్క సంవత్సరకాలంలోనే (1918) సత్యాగ్రహ ఉద్యమాన్ని అణిచివేయడానికి ఆగమేఘాలమీద వ్యవసాయచట్టాన్ని తెచ్చారు. ఆ చంపారన్ నీడలోనే "ఖేడా" రైతాంగ తిరుగుబాటు ప్రారంభమైంది. బలవంత రెవెన్యూ, శిస్తు వసూళ్ళకు వ్యతిరేకంగా ఇవిసాగాయి. ఆ మరుసటి సంవత్సరమే సభలు,

సమావేశాలను చెదరగొట్టే అణిచివేతల చట్టం(1919) వచ్చింది. ఆపైన రెండెళ్ళలోనే సహాయనిరాకరణోద్యమం, ఖిలాఫత్ ఉద్యమాలు ప్రారంభమైయ్యాయి. ఖిలాఫత్ ఉద్యమం హిందు–ముస్లిం ప్రజలమధ్య ఐక్యమత్యానికి తోడ్పడి మతప్రాతిపాదికపై దేశాన్ని చీల్చే ప్రయత్నంలోనే బ్రిటీషు పాలకుల 'విభజించు–పాలించు' ఎత్తుగడకు గండికొట్టిన ఉద్యమంగా గాంధీజీ దేశ ప్రజల ప్రసంశలకు పాత్రుడయ్యాడు. గాంధీ నౌకాలీ యాత్ర సందర్భంగా ఇరుమతాలవారు ఐక్యమత్యంతో జైహింద్ శంఖారావాన్ని పూరించింది కూడా చంపారన్ సత్యాగ్రహ స్ఫూర్తినించే!

విభిన్న జాతులు, మతాలు, సంప్రదాయాలు, భిన్న సంస్కృతులతో కూడివున్న భారతదేశాన్ని లౌకిక స్ఫూర్తి (సెక్యులర్ స్పిరిట్)తో సదా నిలపడానికి గాంధీచేసిన సత్యాగ్రహ ప్రయోగం భిన్న రాజకీయపక్షాలు, విభిన్న పార్టీలనాయకులకు అంతే విభిన్న కోణాలనుంచి (అనుకూల–ప్రతికూల) భిన్నంగా తోచవచ్చు. అయితే ఖిలాఫత్ ఉద్యమాన్ని ఆహ్వానించి బెంగాల్ ప్రధాని షురావర్దీచేత ప్రజలముందు 'జైహింద్' అనిపించగలిగారు! కానీ దేశ సమైక్యత దృష్టితో ఖిలాఫత్ ఉద్యమానికి చేయూతనిచ్చిన గాంధీజీని కాంగ్రెసు నాయకులైన శంకరన్‌నాయర్, అనిబిసెంట్‌లు "అరాచకవాది"గా చిత్రించప్రయత్నించారు. ఇక "హిందుత్వ" పేరు చాటున దాగి జాతిసమైక్యతను బద్దలుకొట్టాడానికి ప్రయత్నించే శక్తులు గాంధీజీనే హత్య కావించాయి! కానీ ఆ శక్తులే దేశాధికారాన్ని చేజిక్కించుకో బోయేముందు నుంచి గాంధీ, భగత్‌సింగ్ బొమ్మలతో ఊరేగుతు దేశప్రజల్ని మోసగిస్తున్నారు. బహుశా అందుకే నెహ్రూ "కాంగ్రెసులో మొదటినుంచి ఆర్.యస్.యస్ శక్తులు ఏదో రూపంలో తిరుగుతునే వచ్చాయి" అనేవారు. అందుకనే నూతన రాష్ట్రపతిగా పదవీస్వీకారం చేసిన రామ్‌నాథ్ కోవింద్, ప్రధాని నరేంద్రమోడీలు ఆ సందర్భంగా హిందూ మహాసభ, ఆర్.యస్.యస్ నాయకులైన శ్యాంప్రసాద్‌ముఖర్జీ, దీన్‌దయాల్ ఉపాధ్యాయ్‌నీ తలుచుకున్నారే కానీ గాంధీని, అంబేద్కర్‌తో పాటు సెక్యూలర్ రాజ్యాంగస్ఫూర్తికి దీటుగా దోహదం చేసిన తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూలను మాటమాత్రంగానైన తలుచుకోలేదు!

నేటి పాలకులు రైతాంగ, కార్మిక, దళిత, బహుజన, మైనార్టీ వర్గ విశాల ప్రయోజనాలకు వ్యతిరేకులైనందువలనే గాంధీజీ చంపారన్ సత్యాగ్రహ లక్ష్యానికి కూడా వాళ్లు ప్రతికూలురని తీర్మానించుకోవలసి వస్తోంది.

# 1. అణిచివేతపై అన్నదాతల చెర్నాకోల చంపారన్ సత్యాగ్రహం

**- గౌరవ్**

బాబ్రీ మసీదు విధ్వంస ఘటన గురించి ఆసక్తికరమయిన నవల రాసిన ఢిల్లీ జర్నలిస్టు అజాజ్ అష్రఫ్ మెయిన్‌స్ట్రీమ్ పత్రికలో చంపారన్ సత్యాగ్రహంలో గాంధీజీకి విషమిచ్చి చంపడానికి బ్రిటీష్‌వారు పన్నిన పన్నాగంలో వారి ప్రలోభాలకు లొంగకుండా గాంధీ ప్రాణాలను కాపాడిన భాటక్ మియా అన్సారీ ఔన్నత్యాన్ని, మతోన్మాదంతో గాంధీ ప్రాణాలు బలితీసుకున్న నాథూరాం గాడ్సేతో పోలుస్తూ వ్యాసం రాసారు.[1] మహాత్ముడ్ని చంపడానికి నిరాకరించి దృఢచిత్తంతో నిలబడ్డవాడ్ని భారద్దేశం ఎలా మర్చిపోయిందనే ప్రశ్నే ఆయన వ్యాసానికి శీర్షిక. ఈ దేశపు రైతు సమస్యపై మొట్టమొదటిసారి క్షేత్రస్థాయిలో అధ్యయనం చేసి అర్థం చేసుకోడానికి ప్రయత్నించిన వ్యక్తికి ఆనాటి నుంచి వరుసగా ఎన్నో బహుమతులు దక్కుతూనే వచ్చాయి.

మానవత్వాన్ని బోధించినవాడికి మతాన్ని అంటకట్టి మంటపెట్టారు. హిందూ పక్షపాతని కొందరూ, ముస్లిం అభిమానని కొందరూ తీర్మానించుకుని కొట్టు మిట్టాడారు.

కులాన్ని వ్యతిరేకించినవాడ్ని కులంతో ముడిపెట్టి కారుకూతలు కూసారు. అపరిణిత దశలో వ్యక్తపర్చిన అభిప్రాయాల్ని తీసుకుని చెట్టెక్కి కూర్చొని కులవాదంటూ రాళ్ళురువ్వారు.

అధికారాన్ని మనస్ఫూర్తిగా అసహ్యించుకున్నవాడికి రాజకీయాల్ని రాసి బజారుకీడ్చారు. అయినదానికీ కానిదానికి ఆయనపై పడి ఏడవడమే ఎత్తుగడను కుంటున్నారు.

ఆర్.ఎస్.ఎస్.కి ఆయనో హిందూ ద్రోహి
ముస్లింలీగ్‌కి ఆయనో ముస్లిం ద్రోహి
కమ్యూనిస్టుల దృష్టిలో ఆయనో బూర్జువా
అంబేద్కరిస్టుల దృష్టిలో ఆయనో బనియా
కాంగ్రెస్‌కి అతడంటే కడుపుమంట
సోషలిస్టులకి అతడో స్వోత్కర్ష

కోట్లమంది హృదయాల్లో చెరగని ముద్ర వేసుకుని కొన్ని తరాల్లో తీవ్ర ప్రభావం కలిగించి, మానవ జీవితానికి సంబంధించి అన్ని అంశాల్లోనూ తనదైన భావాలతో ముద్రవేసిన ఒక వ్యక్తి అంతే స్థాయిలో అపార్థం చేసుకోబడటం చరిత్రలో అరుదైన విషయం. తమకోసం త్యాగం చేసిన వారికి ద్రోహంతో బదులిచ్చే జాతిది. అందుకే చంపారన్‌లో రైతులు కాపాడుకున్న ఆయన ప్రాణానికి మూడు దశాబ్దాల తర్వాత మతంతో వెలకట్టడం జరిగింది.

స్వాతంత్ర్య భారతావని మూడు తూటాల్నాయనకి బహుమతిగా ఇచ్చి రుణం తీర్చుకుంది.[2]

నిజానికి ఇదేం కొత్తది కాదు. చార్వాకలోకాయతులు మొదలుకుని బుద్ధుడు, సోక్రటీసు, క్రీస్తులదాకా ఈ విధంగా వ్యతిరేకించబడినవాళ్ళే. నరేంద్ర దభోల్కర్, గోవింద్ పన్సారే, కల్బుర్గీల దాకా వర్తమాన చరిత్ర మొత్తం ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యమే.

1817 నాటికి సంస్కరణోద్యమ ప్రభావం దాదాపు దేశమంతటా విస్తరిస్తోంది. స్త్రీవిద్య, సతీసహగమన నిరోధ చట్టావిర్భావం సమాజంలో ఆలోచనాపరమయిన చైతన్యాన్ని వ్యాప్తి చేస్తున్నాయి. బ్రహ్మసమాజం విప్లవాత్మకంగా పురోగమిస్తున్న కాలం కనుకనే దేశంలోని అన్ని ప్రాంతాల్లో నూతన భావావిష్కరణోద్యమాలు పురుడు పోసుకున్నాయి. రవీంద్రనాథ్ ఠాగూర్, గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగం వంటి వారుద్భవించిన కాలమిదే. సాంస్కృతిక పునరుజ్జీవన ప్రభావం సరిగ్గా శతాబ్దం తర్వాత మూడు ప్రజా ఉద్యమాల నిర్మాణానికి నాంది పలికింది.[3]

మొదటిది రష్యాలో జారిస్టు నిరంకుశ రాచరిక పాలనను కాదని సామ్యవాద పథంలో తిరుగుబాట్లు చేసి ప్రభుత్వాన్ని కూల్చేసిన ప్రభంజనాలు ప్రపంచమంతటా పీడితులకి వినిపించేలా విజయఢంకా మోగించాయి. భారద్దేశంలో ఆ ప్రభావం ఆచరణాత్మకంగా తర్వాతి కాలంలో బలంగా కనిపించింది.

ఇక రెండోది 1915లో గాంధీ ఇండియా తిరిగొచ్చిన రెండు సంవత్సరాలకి బీహార్లో ఆరంభించిన దేశంలోనే మొట్టమొదటి రైతు ఉద్యమం, అదే చంపారన్ సత్యాగ్రహం. ప్రపంచమంతటా యుద్ధమేఘాలు కమ్ముకుంటున్న ఆ సమయంలో, ఆనాటికి ఎంతో వెనకబడున్న బీహారు ప్రాంతంలోని రైతులతో కలిసి వారిలో ఒకడిగా

ఉంటూ ఏమాత్రం హింసకు తావులేని రీతిలో ఒక చారిత్రక ఉద్యమాన్ని నిర్మించడం కచ్చితంగా చెప్పాలంటే అసంభవం. కానీ, దాన్ని సాధ్యం చేసి చూపినవాడు గాంధీ.

ఇక మూడోది నారాయణగురు ప్రభావంతో తోటి మనుషుల పట్ల అమలౌతున్న అమానుషమయిన వివక్షను ఖండిస్తూ, కుల, మత, వర్గ, వర్ణ, లింగ బేధాల్ని కాదంటూ కేరళలోని కొందరు ప్రగతిశీల యువకులంతా కల్సి అయ్యప్పన్ ఆధ్వర్యంలో లేవదీసిన 'సహోదర' ఉద్యమం. తర్వాతి కాలంలో కేరళ యుక్తివాద సంఘానికి ప్రేరణ రూపమై దేశంలోనే తొట్టతొలి హేతువాద ఉద్యమానికి స్ఫూర్తినిచ్చే పంక్తిభోజనాలతో మొదలై ఎన్నో రాజకీయ సంస్కరణల దాకా సాగిన హేతువాద ఆలోచనా ధార నిర్మాణం.[4]

1857 మొదటి సాయుధ తిరుగుబాటు మొదలుకుని గదర్ ఉద్యమం, భగత్‌సింగ్, అల్లూరివంటివారి సాహసోపేతమయన చారిత్రక భావాల మేళవింపుతోనే భారతదేశ విప్లవోద్యమానికి కూడా బీజం పడింది. ఆ ప్రభావంతోనే 1967లో నక్సల్బరీ వసంత మేఘం గర్జించింది. అలాగే సహోదర అయ్యప్పన్ ఉద్యమం దేశంలోని ఆలోచనోద్యమాలకీ, ఆత్మగౌరవోద్యమాలకీ ఒక ప్రస్థాన స్ఫూర్తయ్యింది.

అయితే చంపారన్ సత్యాగ్రహం గురించి కొంత చెప్పుకోవాలి. నిజానికది ఒక నూతన తరహా ఉద్యమ రూపానికి ఆరంభ స్వరూపం. ప్రపంచదేశాల్లో హింసాత్మక రూపాల్లో వెల్లువెత్తుతున్న తిరుగుబాట్లకి విరుద్ధంగా అద్వితీయరీతిలో ఆధునిక భారతదేశంతో మొట్టమొదటిసారి రైతు ఉద్యమాన్ని నిర్మాణాత్మకంగా సుస్థిరరూపంలో కొనసాగించి విజయం సాధించడం అపూర్వం. పరిశ్రమల పేరుతో పంట భూముల్ని వల్లకాడు చేసుకుని అభివృద్ధి అనుకొంటూ వినాశనాన్ని కొనితెచ్చుకుంటున్న నాగరిక జాతిజాడ్యాల్ని మొట్టమొదట గుర్తించి పరిష్కార ప్రయత్నాలు చేసినవాడు గాంధీ.[5] దేశంలో 80% ఉన్న గ్రామీణాధారిత వ్యవసాయరంగాల్ని చేతనైన అన్ని రూపాల్లో చతికిలపడేలా చేయడానికి 70 సంవత్సరాలుగా స్వాతంత్ర్య దేశాధినేతలు ప్రయత్నిస్తూనే ఉన్నారు. అలాంటి విధ్వంసకర అభివృద్ధిని నిరసిస్తూనే దేశవ్యాప్తంగా నర్మదాబచావో వంటి అతిపెద్ద ప్రజాతంత్రోద్యమాలు మొదలుకుని, జల్, జెంగల్, జమీన్ నినాదంతో ఆదివాసీ ప్రకృతి వనరుల రక్షిత ఉద్యమాలు సైతం రూపుదిద్దుకున్నాయి. దేశంలో అభివృద్ధి పేరిట జరగనున్న ఈ ప్రమాదాన్ని గుర్తించి, హెచ్చరించి, సహజ సిద్ధమయిన సహకార జీవన విధానానికి మద్దతిచ్చిన మొదటి వ్యక్తి గాంధీ. నిజానికి చంపారన్ సత్యాగ్రహ ప్రభావం తర్వాత తలెత్తిన అనేక ఉద్యమాల మీదుంది. ఎన్నో ఉద్యమాలకి

మార్గదర్శకమైంది. చంపారన్ తర్వాత వొచ్చిన ఖెడా సత్యాగ్రహం కానీ, బొంబాయి మిల్లు కార్మికుల సత్యాగ్రహం కానీ సహాయ నిరాకరణోద్యమంకానీ, రౌలత్ సత్యాగ్రహంకానీ, దేశాన్నే ఉవ్వెత్తున అట్టుడికించి తెల్లవారికి చెమటలు పట్టించిన ఉప్పుసత్యాగ్రహంకానీ, అంతిమంగా స్వాతంత్ర్యోద్యమం మొత్తం చంపారన్ ప్రయోగం ద్వారా రూపుదాల్చినవే. ఆధునిక భారతావనిలో చెప్పుకోదగిన అతి ప్రధానమయిన, అంబేద్కర్‌ని తిరుగులేని నాయకుడిగా మలిచిన మహద్ చెరువు పోరాటం నిజానికి సత్యాగ్రహ ప్రభావంతో 'మహద్ సత్యాగ్రహంగా'నే పేర్కొనబడింది. చెరువులో దిగినందుకు అగ్రవర్ణాలు చేసిన దుర్మార్గమయిన దాడిలో ఎంతోమంది అనుచరులు గాయపడినా తనవార్ని తొందరపడకుండా వారించి ఒక సుస్థిర ఉద్యమాన్ని అంబేద్కర్‌చేత నిర్మింపజేసింది ఆ సత్యాగ్రహ స్వభావమే.

సందర్భం వచ్చింది కాబట్టి చర్చకి ఈ విషయాలవసరం. భగత్‌సింగ్ ఉరి విషయం మొదలుకుని అంబేద్కర్‌తో జరిగిన పూనా ఒప్పందం వరకూ గాంధీని విమర్శించొద్దని ఎవరూ అనరుగానీ కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అంబేద్కరిస్టులు, రాయిస్టులు వారి వారి నాయకత్వం లేదా సిద్ధాంత విషయాల్లో స్వీయసమర్ధనకి చూపే తర్కాన్ని గాంధీ వద్దకొచ్చేసరికి ఎందుకు గాలికొదిలేస్తారనేదో సూటి ప్రశ్న.

భగత్‌సింగ్‌కి ఉరిశిక్ష వేసింది బ్రిటీష్ ప్రభుత్వం, గాంధీ కాదు. దాన్ని ఆపగలిగేటంత శక్తియుక్తులు గాంధీకి అప్పుడుండుంటే ఆయనప్పుడే స్వాతంత్ర్యం తెచ్చేవాడు, మూడు దశాబ్దాలకుపైగా ఉద్యమాలు చేసేవాడు కాదు. ఇక దళితులు ముస్లిం, క్రైస్తవ మైనారిటీల్లాగా శాశ్వతంగా అంటరానివారుగా మిగిలిపోకూడదను కున్నాడు కనుకనే పూనాపేక్ట్‌లో కొన్ని విషయాల్ని వ్యతిరేకించాడు.[6]

మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, స్టాలిన్, మావో, అంబేద్కర్, రాయ్, లోహియా, పెరియార్, పూలే, ప్రభృతులంతా జీవితాంతం మారుతూనే వచ్చారు. వారి మానసిక పరిణామం ప్రగతిశీలమయితే ఒక్క గాంధీ పరిణామం మాత్రం తిరోగమన మెందుకయింది? ఆయన చేసాడని ఈరోజున గింజుకుంటున్న ఘోరతప్పిదాలన్నీ ఆయనే చేసానని చెప్తేనో, రాస్తేనో బయటికి తెల్సినవేకానీ ఎవరో వీరపరిశోధనచేసి స్టింగ్ ఆపరేషన్లో బయటపెట్టినవి కాదు.

అదేం చిత్రమో తెలీదుకానీ లౌకికవాదులుగా ఉండి మతస్తులైన నాయకుల్ని అంతా మనకోసమే చేసారని సమర్ధించుకుంటామేగానీ, సామాన్య మతస్తుడిగా మొదలైన గాంధీ లౌకికవాదిగా మారిన పరిణామాన్ని ఎందుకు అర్థం చేసుకోవడంలో

విఫలమౌతున్నాం అనేది మరో ప్రశ్న. ఫాసిజాన్ని సమర్థించినా తప్పులేదు కానీ గాంధీని క్షమించడమంత నేరం మరోటి లేదనే వాతావరణాన్ని ప్రగతిశీలవాదులు సృష్టించారు.[7]

ఫాసిజానికి ఈ ప్రగతిశీల మేధావులకంటే గాంధీవాద ఆలోచనలే తనకెంత ప్రమాదకరమో తెల్సుకనుకనే గాంధీనెలా బలితీసుకుందో గాంధీ వాదుల్ని అలాగే బలితీసుకుంటోంది. నాడు గాంధీని అభ్యుదయవాదులమన్న పేరుతో ఎలా ద్వేషించారో, నేడు ఏ కాస్త గాంధీని సమర్థించినట్లు కనిపించినా అలాగే దూరం పెడుతున్నారు. ఈ రకమయిన మేధోసంకుచితత్వం దార్శనిక దృష్టికి ప్రమాదం.[8] ఆ ప్రమాదం ఈసరికే నివారించలేని స్థాయికి చేరుకుని విద్వేషాన్ని వెదజల్లుతూ వ్యాప్తి చెందుతోంది. ఎవరిపక్షమైనా కావొచ్చుగానీ గాంధీని మనఃస్ఫూర్తిగా వ్యతిరేకించడమే ఉద్యమకారుడికి అర్హతా ప్రమాణంగా మారిపోయింది.

ప్రష్యాలో జ్యూగా జన్మించి భౌతికవాదాన్ని ఒంటబట్టించుకుని హెగెల్ దగ్గర్నించీ అనేకమంది ప్రపంచ తత్వవేత్తల్ని ఔపోశన పట్టి అధోజగత్ సహోదరుల పక్షాన నిలిచేందుకు జీవితాంతం మారుతూనే వచ్చిన కార్ల్‌మార్క్స్ మహానుభావుడు.

సాంప్రదాయిక కుటుంబంలో పుట్టి తీవ్రవాదిగా మారి అనేక సిద్ధాంతాల్లో ఆరితేరి కాంగ్రెస్‌లో కూడా చేరి చివరికి రాడికల్‌గా మారిన రాయి మహోన్నతుడు.

చిన్నప్పట్నుంచీ ఎన్నో వివక్షల్ని తట్టుకు నిల్చి విశ్వవిజ్ఞానాన్నంతటిని జీర్ణించుకుని తన జాతి ఉన్నతి కోసం వివిధ దశల్ని అధ్యయనం చేసి వివిధ పార్టీలు పెట్టి చివరికి బౌద్ధుడిగా మారిన అంబేద్కర్ మార్గదర్శకుడు, పార్టీలకతీతంగా గాంధీ ప్రభావంతో విప్లవకారుడిగా మారిన భగత్‌సింగ్ మొదలుకుని జీవితాంతం ఆయన సహచరులుగానే ఉన్న నెహ్రూ, జె.పి., లోహియాలు కూడా పురోగాములే.

కానీ జీవితాంతం చేసిన తప్పుల్ని నిత్యం దిద్దుకుంటూ వొచ్చి సత్యాహింసల మార్గమే మానవాళికి శరణ్యమన్న విషయాన్ని నిరూపించడం కోసం సొంత జీవితాన్నే ప్రయోగంగా మల్చుకుని పార్టీలకతీతంగా చివరివరకూ మారుతూనే, తనని తాను మార్చుకుంటూనే వొచ్చి చివరికి మతోన్మాదానికి బలైపోయిన గాంధీ మాత్రం జాతి ద్రోహి, దుర్మార్గుడు! వోహో ఏం లాజిక్కండీ!!

నేను గాంధీవాదిని కాదు. నా మొట్టమొదటి రచనలోనే గాడ్సే కోర్టు స్టేట్‌మెంట్ ఆధారంగా గాంధీని తులనాడుతూ పచ్చిగా ఆయన హత్యను సమర్థించినవాడ్ని.

అలాగే భగత్‌సింగ్ చావుకి గాంధీయే కారణమనుకుని తీవ్రంగా విమర్శించినవాడ్ని. అధ్యయనం, దూరదృష్టి లోపించిన ఆచరణ అనాలోచనలతో కూడిన అనర్థాలకి కారణమౌతుందని ఆలస్యంగా గ్రహించినవాడ్ని. [9]

దాదాపు దశాబ్ద కాలంగా ఇదే విషయమై శోధిస్తూ వచ్చిన నాకు తెల్సిందేమంటే వ్యక్తిగా గాంధీ కూడా చాలా తప్పులు చేసుండొచ్చు. ఐతే ఈరోజు గుడ్డిద్వేషంతో ఆయనపై ప్రచారమౌతున్న విద్వేషభావాలకి అడ్డుకట్ట వేయకుండా ఏ విధమయిన భావోద్యమమూ సాధ్యపడదు. అందుకే ఈ ప్రయత్నం చేయాల్సి వొచ్చింది.

ఎంతోమంది చేయి తిరిగిన రచయితలు, మేధావుల్ని చుట్టూతా ఉంచుకుని వందల మైళ్ళ దూరంలో వేరే రాష్ట్రంలోనున్న నాపై అభిమానంతో ఏదో అనువదిస్తాననే నమ్మకంతో ఈ ప్రాజెక్ట్ ఇచ్చి అనేక ప్రాంతాల తిరుగుడువల్ల ఆలస్యమయినా ప్రోత్సాహాన్నిచ్చిన మిత్రులు అభిప్రాయ బేధాలు, భావ భిన్నత్వం స్నేహానికీ, మానవ సంబంధాల సంస్కారానికి అడ్డుకావని నమ్మే పెద్దలూ, రావెల సోమయ్యగారూ, పరిపాటి జనార్ధనరెడ్డిగారికి హృదయపూర్వక ధన్యవాదాలు.

దేశంలోని అన్ని ప్రాంతాల అన్నదాతలూ అసహాయంగా ఆత్మహత్యలకి పాల్పడుతూ, దినకూలీలుగా, వాచ్‌మెన్లుగా వలసపోతూ మానసికంగా దాదాపు శవాలైపోయి, ఇన్నాళ్ళుగా ముద్దపెట్టి ఆదరించిన వ్యవస్థ చేతనే దిక్కుమాలినవాళ్ళుగా చూడబడుతూ, వ్యవసాయం అంటే పనికిమాలిన పనిగా చూస్తున్న ప్రస్తుత పరిస్థితుల్లో దేశ చరిత్రలో తొట్టతొలిసారిగా తమ వీపులపై స్వారీచేస్తూ, తమ చెమటనీ, రక్తాన్నీ జుర్రుకుంటూ వికటహాసం చేస్తున్న దోపిడీదారులకి ఎదురునిల్చి వారి దురాగతాలకి చరమగీతం పాడేలా చెర్నకోల విదిలించిన రైతు విప్లవ శంఖారావమయిన చంపారన్ సత్యాగ్రహ మహోద్యమ స్ఫూర్తినిలా అందించిన, ఈ అక్షరాల సారాన్ని ఈ తరంలో కొద్దిమందైనా గ్రహించి వాదవివాదాలకతీతంగా గుప్పెడు మంది యువజనమైనా నా దేశపు రైతు పక్షాన ప్రశ్నించి నిలవడానికి నిర్ణయించుకుంటే అంతకుమించిన ప్రయోజనం ఈ ప్రయత్నానికి ఇంకేమి లేదనేది నా నిశ్చితాభిప్రాయం సెలవు.



## ఫుట్ నోట్స్ వివరణలు :

1. Bhatakh Mian Vs Nathuram Godse : How has India forgotten about the man who refused to poison Gandhi? by Ajaz Ashraf published in April 17, 2017, Mainstream Weekly.
2. మహాత్ముడ్ని మూడు బుల్లెట్లతోనే హత్య చేయడం జరిగిందనేదే జగమెరిగింది. ఈ అంశంలో ఏర్పాటైన జస్టిస్ జె.ఎల్. కపూర్ కమిషన్ ఈ హత్య విషయంలో నిజాలు రాబట్టడంలో విఫలమైందనీ, మూడు తూటాలు గాడ్సే తుపాకి నుండి వస్తే, నాలుగో తూటా మరో నేరస్తుడు కాల్చాడనీ డా॥ పంకజ్ పథినిస్ అనే ఆయన సుప్రీంకోర్టులో కేసేసాడు. అలాగే చనిపోయేముందు 'హేరామ్' అని గాంధీ అన్నారనీ, లేదనీ కూడా వివాదాలున్నాయి.
3. నేను ప్రధానంగా ఈ మూడు ఉద్యమాల్ని తీసుకున్నాను. అంటే, దానర్థం అదే సమయంలో యితరేతర ప్రాంతాల్లో జరిగిన ఉద్యమాల్ని చిన్నచూపు చూసే ఉద్దేశం నాకు లేదు.
4. 1929లో పురోహిత వ్యతిరేకోద్యమం బొంబైలో ప్రారంభమవ్వడానికి 12 సం॥రాల ముందే కేరళలో అయ్యప్పన్ ఆధ్వర్యంలో సహోదర ఉద్యమం మొదలైంది. "ఒకే కులం, ఒకే మతం, ఒకే దేవుడు" అని పిలుపిచ్చిన నారాయణగురు స్ఫూర్తితో "కులం లేదు, మతం లేదు, దేవుడు వొద్దు" అనే నినాదాన్ని సహోదర ఉద్యమం రూపొందించడం జరిగింది. ఆ సంఘ పత్రికైన 'సహోదరన్' బహుశా తొలి హేతువాద పత్రిక. 2017 మే 27, 28, 29 తేదీల్లో యుక్తివాద సంఘం నిర్వహించిన శతాబ్ది ఉత్సవాల్లో నేను కూడా పాల్గొనడం జరిగింది. సహోదరన్ అయ్యప్పన్ కుమార్తె అయెషా గోపాలకృష్ణన్ పాల్గొన్న ఈ కార్యక్రమంలో పెరియర్ ఉద్యమ సంస్థ ద్రావిడర్ కజగమ్ నాయకుడు వీరమణి సహా ఎంతోమంది దేశవ్యాప్తంగా పాల్గొన్నారు.
5. గాంధేయవాద ఆర్థికవేత్త జె.సి. కుమారప్ప మొదలుకుని ఈ ఎఫ్. షుమేకర్ వరకూ, లోహియా నుంచి అమర్త్యసేన్ దాకా గాంధీ సుస్థిరవిధానాల్ని విశ్లేషణాత్మకంగా అధ్యయనం చేసి అర్థం చేసుకున్న వారెందరో ఉన్నారు. దురదృష్టకర విషయమేంటంటే గాంధేయ వాదులుగా, కమ్యూనిస్టులుగా, అంబేద్కరిష్టులుగా, సోషలిస్టులుగా, రాయిస్టులుగా చెప్పుకునేవారు మాత్రం ఆయనపై రాళ్ళెప్పుడేద్దామా అని కాచుక్కూర్చుని అభివృద్ధి నిరోధకుడంటూ ఆయన్ని ఆడిపోసుకుంటున్నారు.
6. ప్రముఖ డాక్యుమెంటరీ ఫిలింమేకర్ ఆనంద్‌పట్వర్ధన్ Ethics is the Answer శీర్షికతో గాంధీ–అంబేద్కర్లని పోలుస్తూ కీలకమైన వ్యాసమొకటి రాశారు. వాళ్లమధ్య సౌమ్యాల్ని గూర్చి చెప్తూ "Both Gandhi and Ambedkar recognised that this country was so steeped in religion that atheism or pure rationality would not reach the masses. Each in his own way became a liberation

theologist." అంటునే, గాంధీ సత్యాగ్రహమనే దృక్పదాన్ని అంబేద్కర్ ఎలా స్వీకరించాడో చెప్తూ,".. Take the word of *'Satyagraha'* a term coined by Gandhi. Ambedkar used this very term and form a struggle to launch his Mahad Satyagraha to claim drinking water rights." అంటాడు. అంతేకాదు పూనాపేక్టు అనంతరం గాంధీజీ పట్ల అంబేద్కర్ అభిమానం రెట్టింపైందని చెప్తూ ".. I was pleasantly shocked to read what Ambedkar to say in 1932 immediately after concluding the now infamous Poona Pact. The popular Theory is that Ambedkar was blackmailed by Gandhi's fast- unto - death into accepting a bitter compromise. But Ambedkar's tone in 1932 after signing the Pact was totally different. He had High praise for Gandhi and stated that the " Mahatma" (Yes, contrary to popular belief Ambedkar used the term "Mahatma" at this point offered a much better deal for Dalits in terms of reserved seats than Ambedkar himself had asked or hoped for" అంటాడు. (Ethics is the Answer by Anand Patwardhan, Published in Indian Express on April 25th 2017) ఈ విషయానికి సంబంధించీ దాదాపు అర్థ దశాబ్దంగా నేను శోధిస్తున్నా. జనసాహితి మిత్రులు దివికుమార్‌గారి రచనల్ని ప్రాథమికంగా సమర్థించీ భగత్‌సింగ్‌పై ఆయన కృషిని హర్షిస్తూనే గాంధీ అంతటి ద్వేషానికి అర్హుడు కాదేమోననే స్పృహ అవసరమంటున్నా. కాంగ్రెస్ చరిత్ర రాసిన పట్టాభిగారి వాక్కుల్ని దివికుమార్‌గారు తిరుగులేని సాక్ష్యంగా ఉదహరించారు. ఐతే, ఈ మధ్యనే తెలుగులో ప్రచురితమయిన ఆచార్య రంగా స్వీయచరిత్రలో ఈ అంశం ప్రస్తావించబడింది. అందులో "1931 కాంగ్రెస్ సభలకు సర్దార్ పటేల్ అధ్యక్షుడు. ఆ సభలు జరిగింది బ్రిటీష్ ప్రభుత్వం భగత్‌సింగ్‌ను ఉరితీయాలని నిర్ణయించిన వెంటనే. గాంధీజీ దయాభిక్షపెట్టి ఆ దేశ భక్తునికి విధించిన మరణదండన శిక్షను రద్దుచేయమని కోరాడు. అప్పట్లో సామ్రాజ్యవాదుల కిరాతక చర్యలు ప్రగతివాదుల పట్ల అలా ఉండేవి. గాంధీజీ విన్నపాన్ని వాళ్ళు పెడచెవిని పెట్టారు..... భారత కమ్యూనిస్టుపార్టీ మీరట్ ఉదంతం తర్వాత రూపుదిద్దుకుంటున్నది. వారు భగత్‌సింగ్ బలిదానాన్ని రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌కు హాజరు కావాలన్న గాంధీజీ అభిమతాన్ని అనుకూలంగా మల్చుకోగలిగారు..." (చూడు. Fight for freedom, ఆచార్య రంగ స్వీయచరిత్ర, తెలుగు : రావెల సాంబశివరావు, పీకాక్ బుక్స్, హైద్రాబాద్, 2017 పేజీ, 100, 101) మరో ఆసక్తికరమయిన విషయం ఏంటంటే భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల మరణానంతరం తను నడుపుతున్న జనత పత్రికలో Three Victims పేరుతో 1931, ఏప్రిల్ 13న అంబేద్కర్ సంపాదకీయం రాసాడు. మరాఠీలోనున్న దాన్ని ఆనంద్ తేల్‌తుంబ్డే ఇంగ్లీషు చేసాడు. అందులో "The issue of Bhagat Singhs death penalty might have arisen in negotiations that took place between Gandhi and Lord Irwin. Although Lord Irwin had not given

any definitive assurance about saving Bhagat Singh's life, Gandhi's speech during the intervening period created a hope that Irwin would try his best within his powers to save lives of these three youth. But all these hopes, predictions and appeals proved futile.." అంటూ, "...The entire world as well as the government does, knows that it is not the devotion to justice Godess but the fear of the conservative party and public opinion back home in England that this sacrifice was executed". గాంధీని జీవితాంతం నిష్కర్షగా కఠినంగా విమర్శించిన అంబేద్కర్ ఎంతో దూరం ఆలోచించి పరిణితితో నాటి పరిస్థితిని అర్థం చేసుకుని బ్రిటీష్ సామ్రాజ్యవాదాన్ని భగత్‌సింగ్ ఉరికి కారణంగా గుర్తించారు. కేవలం గాంధీమీద ద్వేషంతోనే మన అభ్యుదయవాదులు భగత్‌సింగ్ ఉరిని బూచిగా చూపి గాంధీని ఆ ఉరికి బాధ్యుడ్ని చేస్తున్నారు. (ఈ విషయమై నేనింకా పూర్తిగా పరిశోధిస్తున్నాను - అను) ఐతే 1931లో "భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్‌ల ఉరిని ఖండిస్తూ కరాచీ కాంగ్రెస్‌లో గాంధీజీ ప్రవేశపెట్టిన తీర్మానం ఆ విప్లవీరుల్ని అవమానపరిచేలా ఉందని భావించిన కంభంపాటి సత్యనారాయణ సీనియర్‌గారు దానికి వ్యతిరేకంగా ఓటు వేసారు" (చూడు. ఆంధ్రుల చరిత్రలో నూతన ఆవిష్కరణలు, టి. రవిచంద్, విశాంలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైద్రాబాద్, ప్రథమ ముద్రణ - అక్టోబర్ 2004, పేజీ-2) కావున ఈ అంశంపై యింకా శోధించాల్సుంది. అలాగే గాంధీని బహుజన శత్రువనీ, దళిత ద్రోహనీ ప్రచారం చేస్తున్నారు. రాజకీయ తాత్విక విభేదాల్ని సైతం హుందాగా వెల్లడించుకున్న నాటి నాయకుల వ్యక్తిత్వాన్ని ఎంతమాత్రంగానైనా అర్థం చేసుకునే యత్నం చేయకుండా మహాత్ముని పై బురద చల్లడం ఈ రోజొక నాగరికతకి హూదాగా చూడబడుతోంది, ఇదో దౌర్భాగ్యం.

7. ప్రసిద్ధ చరిత్రకారులు బిపిన్ చంద్ర మాటల్లో, "గాంధీజీని తరచూ అపార్థం చేసుకోవడం జరుగుతూ ఉంది. ఆయనకు గల ఒక గొప్ప సుగుణాన్ని ఆయన అభిమానులు, విమర్శకులు కూడా అర్థం చేసుకోలేకపోతున్నారు. అదేమంటే, ఆయన నిరంతరం మారుతూ అభివృద్ధి చెందుతూ వచ్చారు. అనేకమంది ఆయన గతంలో కులవ్యవస్థని గురించి, యంత్రాల వినియోగాన్ని గురించీ, కులాంతర, మతాంతర వివాహాల్ని గురించీ, ధర్మకర్తృత్వం సిద్ధాంతపైనా, భూస్వామ్య, రైతుల మధ్యగల సంబంధాల్ని గురించీ, అలాగే సోషలిజం, బోల్షివిజం, పార్లమెంటరీ వ్యవస్థ మొదలగు వాటిని గురించి ఆయన రాసిన రచనల నుండి ఉదహరించడం జరుగుతుంది. అయితే, యదార్థమేమంటే మానవ విలువలను గురించి తనకు గల విశ్వాసాల్ని చెక్కుచెదరకుండా యధాతథంగా ఉంచుకుంటూనే పైన ఉదహరించిన అన్ని సమస్యలపైనా తన అభిప్రాయాలను పూర్తిగా మార్చుకుంటూ వచ్చారు. అది కూడా సరైన రీతిలోనే. ఆ విషయాన్ని తరచూ చాలామంది గుర్తించలేకపోతున్నారు. ఎందువల్లనంటే ఆయనను విమర్శించినవారు ఆయనను దెబ్బతీయడానికి గతంలో ఆయన చెప్పిన అభిప్రాయాలనే ఉదహరించుతూ ఉంటారు.

మరో వైపున ఆయన అనుచరుల్లో పెక్కుమంది ఆయన గతంలో రాసినవి, చెప్పినవీ అన్నీ పవిత్రమైనవనీ, మార్చరానివనీ నమ్ముతూ వుంటారు. కాని ఈ ఉభయులూ 1938లో ఆయన చేసిన ప్రకటనను బట్టి నేర్చుకోవలసి వుంది." "ఎప్పుడో నా రచనల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలు, అలాగే నేను చెప్పిన విషయాలను, ఇటీవల నేను చేసిన రచనలు పూర్వపరం చేస్తాయి. వృద్ధాప్యం కారణంగా నా శరీరం కృశించిపోతున్నప్పటికీ నా వివేకమూ, నా అభిప్రాయాలను వెనకబట్టకపోగా అవి మరింతగా పెరుగుతున్నాయని నేను ఆశించుతున్నాను." అంటారు గాంధీ. (చూడు. గాంధీ నాయకత్వ విశిష్టత, బిపిన్ చంద్ర, అనువాదం : బొమ్మారెడ్డి, ప్రజాశక్తి, ఏప్రిల్ 2003, పేజీ 10). అంతేకాదు గాంధీని మొదట్లో తీవ్రంగా దుయ్యబట్టిన ప్రముఖ కమ్యూనిస్టు, బౌద్ధదార్శనికుడు రాహుల్ సాంకృత్యాయన్ తర్వాతీకాలంలో తన అభిప్రాయాలను పూర్తిగా మార్చుకున్నాడు.(చూడండి: ఇద్దరు మహావ్యక్తులు బుద్ధడు – గాంధీ రచన : రాహుల్ సాంకృత్యాయన్, అనువాదం: డా॥ జె.ఎల్.రెడ్డి, ముద్రణ:2017 సంకలనం, ప్రచురణ: టి.రవిచంద్, మిళింద ప్రచురణలు, బాపట్ల) అలాగే పూనాలో ఒక సభలో మాట్లాడుతూ ప్రొఫెసర్ అపూర్వానంద నిజమైన గాంధీ చివరిరోజుల్లోని గాంధీయే అంటారు. 'గాంధీ చివరి రోజులు' అనే అంశంపై ఆయన ప్రసంగించారు. తేదీ గుర్తులేదు.

8. హిమంశువంటివారు చత్తీస్‌ఘడ్‌లో ఆదివాసీల మధ్య నిస్వార్థంగా పనిచేస్తోంటే గాంధీవాదనే నెపంతో సైన్యం ఒకసారీ, మావోయిష్టులు మరోసారి ఆయన ఆశ్రమాన్ని కూల్చేసారు. ప్రస్తుతమాయన ఇతర రాష్ట్రాల్లో ఉన్నారు. అలాగే 16 సం॥రాల పాటు నిరాహార దీక్ష చేస్తూ వచ్చి ప్రపంచంలోనే శక్తివంతమయిన ఉక్కు మహిళగా పేరొందిన ఈశాన్య రాష్ట్రాల ఉద్యమస్వరమయిన ఇరోం షర్మిల ఎన్నికల్లో నిలబెడితే 90 వోట్లతో వోడించి ప్రజాస్వామ్యంపై ఉమ్మేసిన ఘనులు మన ప్రజ.
9. నా మొదటి రచన ప్రజాస్వామ్య పతనం (The Decline of Democracy) లో గాంధీని ఉతికారేయడమే కాక దివికుమార్‌గారి 'ఉరికంభం సాక్షిగా' పుస్తకాన్ని సమీక్షిస్తూ హెన్స్ ఇండియా పత్రికలో 'Gallows are witness' అనే చిన్న వ్యాసం కూడా రాసాను. ఇప్పటికీ ఆ రాతల్తో విబేధించట్లేదు కానీ గాంధీపై గుడ్డి ద్వేషాన్ని అంగీకరించడం లేదు.



# ౨. చంపారన్ సత్యాగ్రహం
# వంద సంవత్సరాల రైతుల యథాతథస్థితి

**- తుషార్ గాంధీ**

**మహాత్మాగాంధీ మునిమనవడు, ముంబైలోని మహాత్మాగాంధీ ఫౌండేషన్ బాధ్యుడు**

(ఏప్రిల్ 2017 డౌన్ టు ఎర్త్ కవర్‌పేజీ కథనంగా మార్చింది)

ఒక శతాబ్దం తర్వాత కూడా దేశంలోని వ్యవసాయ రంగం మారినట్టు కనబడకపోవడమొక విషాదం. చంపారన్‌లో వంద సంవత్సరాల క్రితం నీలిమందు రైతుల స్థితి ఎలా ఉందో ఈరోజు ఆధునిక భారదేశంలోని రైతులందరి పరిస్థితి అలా ఉంది. నీలి సత్యాగ్రహంగా పేరొందిన చంపారన్ ఉద్యమం నైతిక విలువలకోసం, హక్కుల కోసం జరిగిన పోరాటానికి చిహ్నం. అంతులేని లాభాల కోసం పేదల్లో అతి బీదల్ని అడ్డూ అదుపూ లేకుండా దోచుకునే తతంగం నాడు బాహాటంగా సాగుతుండేది. రాజ్యం అండదండలతో కళ్ళుమూసుకుపోయిన ధనిక భూస్వామ్యులొకవైపు, అవకాశాలన్నింటికీ దూరం కాబడి ఉనికికోసం ఊడిగం చేస్తూ బానిసలుగా బతికే రైతాంగం మరోవైపు వెరసి మొత్తంగా నాడు ఈ అంశాన్ని అత్యంత ఉద్వేగభరితం చేసాయి. తమ పక్షాన ప్రశ్నించే స్వరం లేదనే భావన బీదవారికుండేది.

కామన్ మార్కెట్ పేరుతో వరల్డ్ కమ్యూనిటీ పేరుతో సరళీకృత ఆర్థిక విధానాల ద్వారా ముడిసరుకుల్ని మాంచి ధరకి అమ్ముకునే క్రమం ఇప్పట్లాగే అప్పుడూ ఉంది. వర్తకవాణిజ్యమంతా సరుకులు తయారుచేసేవారికి అనుకూలంగా స్థిరపడి, ముడిసరుకు అమ్మకందార్లనూ, అలాగే వినియోగదారుల్నీ బాధితులుగా మార్చడం జరిగింది.

భారతదేశంలోని నీలిమందు రైతుల ఉత్పత్తి వలన మాంచెస్టర్‌లోని మిల్లులు బాగుపడటం జరిగింది. ఆ పంటను పండించడం రైతులకి తప్పనిసరైంది. కానీ ఎప్పుడయితే వలసవాదులు కృత్రిమ సింతటిక్ బట్టని ప్రత్యామ్నాయంగా చౌకగా పొందడం మొదలయిందో అప్పుడిక వారికి రైతులతో పనిలేకుండా పోయింది. ఫలితంగా రైతు వదిలివేయబడ్డాడు. ఈ మధ్య కాలంలో విదర్భలోని పత్తి రైతుల పరిస్థితి సరిగ్గా ఇలానే ఉంది. ఇన్నాళ్ళుగా విదర్భలోని రైతులు ఉత్పత్తి చేసిన పత్తిని వాడుతూ వచ్చిన నేతమిల్లులు, ఇప్పుడు బడా కంపెనీలు తయారుచేస్తున్న పెట్రోకెమికల్ సంబంధిత సింథటిక్ దారాన్ని మాత్రమే ఉపయోగిస్తున్నాయి. ఇదెంత దురదృష్టకరమంటే, సహజసిద్ధమైన, పర్యావరణానుకూల ఉత్పత్తులవైపు పూర్తిగా వెళ్ళకుండానే మనం మన సంప్రదాయిక నైపుణ్యాలన్నింటినీ విడిచిపెట్టేసాం.

కాబట్టి, ఈరోజున మళ్ళీ వాణిజ్యపరంగా, న్యాయానికి చిహ్నంగా నీలి సత్యాగ్రహం చాలా అవసరం. కానీ సత్యాగ్రహాన్ని చేయడం ప్రస్తుతం బ్రిటీష్ పాలనలో కంటే కష్టతరం. ఆనాడది పరాయి పరిపాలనకి వ్యతిరేకంగా జరిగిన పోరాటం. కానీ ఇప్పుడు మనం తోటి పౌరులతోను, సొంత ప్రభుత్వంతోనే దెబ్బలాడాలి. అంతేకాక, మనం మన రాజకీయ విశ్వాసాల దృష్ట్యా కూడా విభజించబడి ఉన్నాం. దురదృష్టవశాత్తూ, ఉద్యమాలేవీ, ముఖ్యంగా రైతు ఉద్యమాలు, రైతు సంఘాలు కూడా రాజకీయ ప్రభావాల నుంచి దూరంగా లేవు. రాజకీయ ప్రభావాలెంత తొందరగా చుట్టుముడతాయో అప్పుడిక ఉద్యమాలు వాటి సారాన్ని కోల్పోతాయి.

నేటి సత్యాగ్రహం రైతు ఆత్మహత్యలపై ఎక్కుపెట్టాలి. ఈనాటి వాస్తవ పరిస్థితుల్నుంచి తప్పుకోదలచి వారిని వారు చంపుకుంటున్న రైతులు నిజంగా బలవంతులూ, సమర్థులూ, కానీ వారి పిల్లలు, వితంతువులయిన భార్యలు, తల్లిదండ్రులు భవిష్యత్తులో పగ, ప్రతీకారాలతో రగిలిపోయే సమిధలుగా మారరని నిశ్చయంగా చెప్పగలగాలి.

వ్యవసాయ సంస్కృతిలో రైతుపై పడే ఏ ప్రభావమయినా మొత్తం సమాజాన్ని ప్రభావితం చేస్తుందని గ్రహించాడు కనుకనే మహాత్మాగాంధీ రైతుల కోసం పోరాడటానికి సిద్ధపడ్డాడు. లేకపోతే, ఆయన తలకెత్తుకోడానికి కావాల్సినన్ని అంశాలు ఎన్నో ఉ న్నాయి. ఆయన దక్షిణాఫ్రికా నుంచి ఇండియా వచ్చేనాటికి నగరాలకే పరిమితమయిన మేధావుల మధ్య హెూమ్‌రూల్‌కి సంబంధించి, స్వాతంత్ర్యానికి సంబంధించి చర్చలు నడుస్తున్నాయి. కానీ, నీలి సత్యాగ్రహం దేశానికంతటికీ నూతన జీవాన్ని పోసి తిరుగుబాటుకి ఎదురులేని చిహ్నంగా నిలిచింది.

ఈ రోజుకు కూడా ప్రపంచ వ్యాప్తంగా పెరుగుతున్న అసమానతలు, ధనిక–పేద వ్యత్యాసాల గురించిన చింత ఎక్కువౌతోంది. ఇందుమూలంగా తలెత్తే విపరీత పరిణామాల్ని ఎదుర్కొనేందుకు ఆలోచన జరుగుతోంది. ఆ మేరకు భవిష్యత్తు గురించిన బెంగ అలముకొంది. చంపారన్ అనేది బీదలకీ, అణగారిన ప్రజలకి న్యాయం కోసం పోరాడటం నేర్పిన అత్యంత శక్తివంతమయిన ప్రజా ఉద్యమానికో ప్రతీక. అలాకాక నీలి సత్యాగ్రహాన్ని కేవలం నీలిమందు రైతుల హక్కుల ఉద్యమంగా కనుక అర్థం చేసుకుంటే కనుక ఈనాటికది అసంగతంగానే కనిపిస్తుంది, అసందర్భంగానూ అనిపిస్తుంది. కానీ, పీడిత ప్రజల సాధికార ఉద్యమంగా పరిశీలిస్తే, ఈనాటికీ దానికున్న విలువా, శక్తీ బోధపడతాయి. అప్పుడది వర్తమానానికి సైతం వర్తించేదిగా మిగులుతుంది.

# 3. చారిత్రక మహోద్యమం - చంపారన్ సత్యాగ్రహం

**- ఇర్ఫాన్ హబీబ్**

**ప్రముఖ మార్క్సిస్ట్ మేధావి, చరిత్రకారుడు**

(ఏప్రిల్ 16, 2017న జనతా పత్రిక కవర్ పేజీ కథనంగా వచ్చింది)

జాతీయోద్యమ కాలం నాటి విలువలు, ఆదర్శాలు ప్రజానీకపు జ్ఞాపకాల్లోంచి క్రమేణా చెరిగిపోతున్నాయి. ఇలాంటప్పుడు ఆధునిక భారతచరిత్రను మలుపుతిప్పి, భూమికోసం, భుక్తి కోసం పోరాడే రైతాంగాన్ని స్వాతంత్ర్యోద్యమానికి సిద్ధం చేసిన గొప్ప ఉద్యమం చంపారన్ శతాబ్ది ఉత్సవం జరుపుకోవడం నిజంగా సంతోషకర మయిన విషయం.

ప్లాసీ యుద్ధం (1757) నాటి నుండీ భారతదేశంలో బ్రిటీషువారు ఒక నిర్దిష్ట పద్ధతిలో దోపిడీ చేస్తూ వచ్చారు. రైతులు, చేతివృత్తిదారులంతా అప్పుడే చతికిలపడ్డారు. ఎందుకనంటే ఆ ప్రభావంతో మోయలేని భారం వారిపై పడింది. పరిశ్రమల పతనాన్నీ, ఖజానాను ఖాళీ చేయడాన్నీ తద్వారా దేశం నాశనం అవ్వడాన్ని, ప్రజల కళ్ళకు కట్టినట్టు చూపించడం నాడు జాతీయవాద మేధావులు సాధించిన వో గొప్ప విజయం. దాదాభాయి నౌరోజి రాసిన poverty and Un-British Rule in India (1901) లో ఈ విషయాల్ని బహిర్గతపర్చి సంప్రదాయబద్ధంగా విశ్లేషిస్తే, ఆర్.సి. దత్ తన రెండు సంపుటాల Economic History of India under British rule (బ్రిటీష్ పరిపాలనలో భారద్దేశ ఆర్థిక చరిత్ర 1901, 1903)లో చారిత్రక దృష్టితో పరిశీలించారు. గాంధీజీ ఈ అంశాలనే గుజరాతీలో రాసిన 'హింద్ స్వరాజ్' (1909)లో సంగ్రహంగా ఊటంకించారు.

**నీలిమందు అణిచివేత :**

భారతదేశాన్ని బలహీనపర్చి బీదరికంలోకి దిగజార్చే దోపిడీ విధానాల్లో తొలినాటి జాతీయవాదులెంతగా ప్రయత్నించినప్పటికీ ఆంగ్లేయులు దోపిడీదార్లుగా కనిపించేవారు కాదు. భూమిశిస్తుని జమీందార్లూ వారి స్థానిక అధికారులూ వసూలు చేసేవారు, అలాగే విదేశీ వస్తువుల్ని భారతీయ దుకాణదారులూ, వ్యాపారులూ అమ్మేవారు. తోటలు, గనుల దగ్గర మాత్రమే ఆంగ్లేయులు పీడకులుగా కనిపించేవారు. అందులోనూ, నీలిమందు తోటల్లో జరిగే అణిచివేతకి దీర్ఘకాలిక చరిత్ర ఉంది.

భారతీయ నీలిమందు ప్రాచుర్యం పొందింది, అనేక శతాబ్దాలుగా క్రమపద్ధతిలో అదిక్కడి రైతాంగంచేత ఉత్పత్తి కావించబడేది. 17వ శతాబ్దంలో వెస్టిండీస్‌లోని బానిసలచేత పండించబడే యూరోపు యాజమాన్యంలో కల నీలిమందు తోటలు బాయిలర్లను వాడటం ద్వారా ద్రావకాన్ని తీయడంలో అభివృద్ధి సాధించాయి. ఆంగ్లేయులు బెంగాల్‌పై విజయం సాధించాక జమీందార్లను లోబర్చుకొని మరిన్ని నీలిమందు తోటల పెంపకాన్ని రైతాంగం చేత చేయించి అద్దకపు పనిని వారి ఫ్యాక్టరీల్లో చేసుకునేవారు. ఇక్కడి రైతులపై నీలిమందు తోటల పెంపకాన్ని బలవంతంగా రుద్ది చౌకధరకి దాన్ని తమకి అమ్మేలా చేసే పద్ధతుల్ని చిత్రిస్తూ బంధుమిత్రా రచించిన 'నీల్‌దర్పన్' (1860) ప్రాచుర్యం పొందింది. ఆ కారణంగా బెంగాల్‌లోని నడ్డియా ప్రాంతంలో 1859-1860 మధ్య కాలంలో, తలెత్తిన రైతు పితూరీలు అధికార గణంచేత అణిచివేయబడ్డాయి.

ఆ విధంగా నీలిమందు తోటలు బీహార్‌కు కూడా విస్తరించబడ్డాయి. అక్కడ కూడా జమీందారీ విధానాన్ని అడ్డం పెట్టుకుని రైతుల్ని ఆంగ్లేయుల ఆలోచనల కనుగుణంగా ఆడించే విధానం నడిచేది. బ్రిటీషువారు జమిందార్లను కొనేవారు కాదు కానీ జమీందారీ భూమిని కౌలుకు తీసుకుని దాన్ని రైతులకిచ్చే 'టేకేదార్'ల అవతారం ఎత్తేవారు. జమీందార్లకి ఏమాత్రం తీసిపోని విషపు పాత్రను పోషిస్తూ బీహార్లోని చంపారన్ జిల్లాలో గ్రామాల్లో యూరోపియన్లంతా ఆధిపత్యం చెలాయించేవారు. నూలు ఎగుమతి విస్తరించడం వల్ల తోట యజమానులు 'టిన్-కతియా' అనే పద్ధతిని రైతాంగం మీద రుద్దేవారు. అందువల్ల రైతులు తప్పనిసరి పరిస్థితుల్లో సారవంతమయన వారి భూముల్లో నీలిమందుని పండించాల్సి వచ్చేది.

## యూరోపు దోపిడీ:

ఇలా ఉండగా 1880ల్లో జర్మనీలో కృత్రిమ సింథటిక్ అద్దకం వృద్ధికావడంతో సంక్షోభం తలెత్తింది. సహజ నీలిమందు అద్దకం దాని ధాటికి నిలవలేకపోయింది. దాంతో దేశంలో నీలిమందు ఎగుమతులు 4.75 కోట్ల నుండీ ఒక్కసారిగా 1894-95 సం॥రం నుంచీ అర్ధదశాబ్దం దాకా 2.96 కోట్లకు పడిపోవడం జరిగింది. అప్పుడిక నీలిమందు తయారీదార్ల లాభాలు సైతం దిగొచ్చాయి. ఆ భారమంతా రైతులు మోయాల్సొచ్చింది. పంట యజమానులు జమీందారీ ధోరణిలో రైతులపై భారం మోపడం జరిగింది. ఇది రెండు విధాలుగా జరిగింది : మొదటిది, షరాబ్షి పేరుతో టెకేదార్లు రైతుల కౌలును పెంచేయడం జరిగింది. మామూలుగా గతంతో పోలిస్తే

50 నుంచీ 60 శాతం అధికంగా అదుండేది. ఇక రెండోపద్ధతి ఆసక్తికరమైంది, నీలిమందు ధరలు పడిపోయాక 'టిన్ కతియా' విధానంలోగల రైతులు నీలిమందు ఉత్పత్తిని ఇష్టపడేవారు కాదు. యజమానులు కూడా కొనడానికి ముందుకొచ్చేవారు కాదు. అంతేకాక ఎవరైతే రైతులు 'తవాన్' పేరుతో పెద్ద మొత్తం పరిహారమివ్వడానికి సిద్ధపడతారో వారిని వేరే పంటలు పండించుకునేందుకు అనుమతిచ్చేవారు. యజమానులు విధించే పరిహారం ఎంత ఎక్కువగా ఉండేదంటే మొత్తం సం॥రంలో రైతు పగలనకా రాత్రనకా ఒళ్ళొంచి కష్టపడి 12 శాతం మాత్రమే చెల్లించగలిగేవాడు. అంతేకాక నీలిమందు ఫ్యాక్టరీల నుంచీ, తోటల నుంచీ వెళ్ళకొట్టబడిన రైతులు వారి సొంత కౌలుభూముల్ని కాపాడుకునేందుకు 'జిరాత్' పేరుతో అధికమొత్తంలో సుంకం కట్టాల్సివచ్చేది. ఇవేకాక యజమానులు వారి చిత్తానుసారంగా ఇష్టమొచ్చినట్లల్లా 'అబ్‌వాబ్' పేరుతో అక్రమసొమ్ములు, జరిమానాలు వసూలు చేసేవారు. ఇవి మట్టుకే కాక యజమానులు 'బిగార్' అనబడే సంప్రదాయ భూస్వామ్య ఆధిపత్యాన్ని అనుసరించీ వేతనరహిత శ్రమని రైతుల నుంచి పొందుతూ వారిచేత వెట్టిచాకిరీ చేయించుకునేవారు. రైతు ఎడ్లనూ, నాగలి సహా వ్యవసాయ పనిముట్లను అప్పనంగా తమ పంటలకు వినియోగించుకునేవారు. ఒక్కమాటలో చెప్పాలంటే, యజమానులు కృత్రిమ నీలిమందు కారణంగా తలెత్తిన సంక్షోభ నష్టాన్నంతటినీ రైతుల నెత్తిమీదకు నెట్టి తమ లాభాల్ని మాత్రం భద్రంగా పెంచుకోడానికి ప్రయత్నించారు.

1914 మొదటి ప్రపంచ యుద్ధం నాటికి ఈ రకమయిన సంక్షోభం కాస్త తగ్గుముఖం పట్టింది. కృత్రిమ నీలిరంగు ప్రధాన ఉత్పత్తిదారైన జర్మనీ స్వయంగా యుద్ధంలో పాల్గొనడం వలన లాభాల రుచిమరిగిన యజమానులు తిరిగి నీలిమందు పంటలవైపు మళ్ళించడానికి రైతులను బలవంతపెట్టసాగారు. 'టిన్‌కతియా' విధానంలోకి రావాలని రైతాంగాన్ని పీడించసాగారు. అంటే, పండించిన పంట నిష్పత్తిని బట్టి కాక పండిన ప్రదేశం ఆధారంగా ధర నిశ్చయించే పద్ధతిలోకి లాగారు. అంతకు ముందు నుంచీ రైతుల పాలిటి శాపాలయిన షరబ్షి, తవాన్ మొదలయిన పద్ధతులు అలాగే కొనసాగుతుండేవి. ఇవన్నీ కాక బిగార్ అనబడే వెట్టి సరేసరి. అలా రైతులు నాణ్యమయిన నీలిమందును రెక్కల కష్టంతో పండించి యజమానులకు లాభాలార్జించిపెడుతూ తాము మాత్రం నామమాత్రపు సొమ్ముతో మోసపోతుండేవారు. సారవంతమయిన వారి భూముల్ని కూడా కుట్రపూరితంగా యజమానుల లాభార్జనకు బలిపెట్టాల్సి వచ్చేది. ఇంతేకాక అప్పుడప్పుడూ యజమానుల కోపానికి గురికావాల్సి

వచ్చేది. అటువంటప్పుడు ఒళ్ళెరుగని యజమానుల అహంకారానికి బలై వారి తిట్లు, తన్నులు, దెబ్బలు భరించాల్సి వచ్చేది. అన్యాయం, లంచగొండితనం కూడా ఉద్భవించాయి. రైతులకే మాత్రం విలువలేని ఒక పెత్తందారీ రాజ్యం బ్రిటిష్‌వారి కనుసన్నల్లో యజమాన్లకి కౌలుహక్కులు కట్టబెట్టేందుకు నిరంతరాయంగా రైతాంగాన్ని దోపిడీ చేస్తూ అణిచివేసేందుకు అవిరామంగా నడిచిందనడం అతిశయోక్తి కాబోదు.

## చంపారన్‌లో గాంధీజీ:

డిసెంబర్ 1916లో లక్నోలో జాతీయ కాంగ్రెస్ సమావేశం గురించి విని అక్కడికెళ్ళిన చంపారన్ ప్రతినిధి బృందం రైతు సమస్యల గురించి ప్రస్తావించడం జరిగింది. ఒక దశలో రైతు దుస్థితి గురించి మొత్తం సమావేశ దృష్టిని ఆకర్షించింది. తదనంతరం గాంధీజీని కలకత్తా నుంచీ పాట్నా తీసుకొచ్చిన రాజ్‌కుమార్ శుక్లా అనూహ్యంగా ఆయన్ని చంపారన్‌కి తీసుకురావడం మొదలైన పరిణామాలన్నీ ఆసక్తికరంగా అతి ప్రధానాంశాలే.

చంపారన్ ఉద్యమాన్ని గాంధీజీ నిర్వహించిన పద్ధతి ఒక గంభీరమయిన నాయకత్వ నమూనాకి ప్రతీకగా నిల్చింది. ఆయనక్కడికి వెళ్ళేనాటికి దక్షిణాఫ్రికాలోలా సత్యాగ్రహం చేసేందుకు పరిస్థితులనుకూలంగా లేకపోగా రైతులంతా దీర్ఘకాలంగా పీల్చి పిప్పిచేయబడి ఉన్నారు. అందువల్ల, గాంధీజీ ముందుగా తాను అక్కడి పరిస్థితుల్ని అధ్యయనం చేసేందుకు అవసరమయిన సమాచార సేకరణలో భాగంగానే వచ్చానని ప్రకటించారు. నిర్భయులైన కొంతమంది యువతను ఆ రకంగా కూడగట్టగలిగారు. తర్వాతి కాలంలో ఆయన ముఖ్య అనుచరుడిగానున్న బ్రిజ్‌కిషోర్ ప్రసాద్, బీహార్‌లో ప్రముఖ కాంగ్రెస్ నేతగా రూపొందిన రాజేంద్రప్రసాద్ కూడా వారిలో ఉన్నారు. గాంధీజీ తన బృందం మొట్టమొదట రైతుల దగ్గరికి వెళ్ళి వారి ఫిర్యాదుల్ని నమోదు చేసుకునే కార్యక్రమాన్ని మొదలుపెట్టారు. ఆఖరికి అదే చంపారన్ సత్యాగ్రహంగా రూపొందింది.

## ఫిర్యాదుల సేకరణ :

ఈ తతంగం నిరపకారమైందని బ్రిటీష్ అధికారులు భావించారు. దీనివల్ల వారికొచ్చే నష్టమేమీ లేదని అనుకున్నారు. ఐతే, ఒక్క సామాన్య రైతు ముందుకొచ్చి ఫిర్యాదు చేయడం ఎప్పుడైతే చూసారో అప్పుడిక రైతులంతా వారి వారి భూముల్నెలా

స్వాధీనం చేసుకున్నారో తమనెలా లొంగదీసుకున్నారో చెప్పడం కోసం బారులు తీరారు. ఈ పరిస్థితుల్లో ఏప్రిల్ 16న బ్రిటీష్ జిల్లా న్యాయాధికారి గాంధీజీ జిల్లాను వొదిలివెళ్ళిపోవాలని క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144 సెక్షను ప్రకారం ఆదేశాలు జారీ చేసాడు. దాని ప్రకారం ఏప్రిల్ 18న జిల్లా న్యాయాధికారి ఎదుట ముద్దాయిగా ప్రవేశపెట్టబడిన గాంధీ జైలుశిక్షకి సిద్ధపడి మొట్టమొదటిసారిగా ఈ అంకంలో తన **'ధిక్కార చైతన్య స్వరాన్ని'** వినిపించాడు. అతి సామాన్యంగా అగుపించే ఆ అంకితభావంతో కూడిన నిబద్ధతే ఆరోజు విజయం సాధించింది. పాలకవర్గం గాంధీని చిక్కుముడుల కేసులో ఇరికించి ఎటూ తోచకుండా చేయాలనే ఆలోచనతో  ఉంది. మరోవైపు ప్రఖ్యాత బీహార్ కాంగ్రెసునేత మజ్‌హరుల్‌హక్ సహా అసంఖ్యాక కార్యకర్తలు, రైతులు గుంపులు గుంపులుగా న్యాయస్థానం ఎదుట గుమిగూడారు. చంపారన్ చరిత్రలో బహుశా మొట్టమొదటి నిజమైన ప్రజా ప్రదర్శనది. అప్పుడిక ఏం చేయాలో తోచక న్యాయాధిపతి కోర్టుని వాయిదా వేసి, గాంధీజీని తన స్వంత పూచీకత్తుపై విడుదల చేసాడు! చివరాఖరికి ప్రభుత్వం దిగొచ్చింది. ఏప్రిల్ 21 తేదీన బీహార్, ఒరిస్సా సంయుక్త లెఫ్టినెంట్ గవర్నర్ నుండీ గాంధీజీకి ఆయనపై మోపబడిన నేరారోపణను వాపసు తీసుకుంటున్నట్లుగా అధికారిక ఉత్తర్వు అందింది. అలాగే ఆయన 'సమాచార సేకరణ'కు సహకరించాల్సిందిగా స్థానిక అధికారులకు ఆదేశాలివ్వడం జరిగింది.

ఈ విజయం రైతుల మనస్సులోని కన్నీటి కథనాలకి ఫిర్యాదు రూపమివ్వడానికి పనికొచ్చింది. స్థానిక వకీళ్ళు అసంఖ్యాకంగా గాంధీ అనుచరగణంలో స్వచ్ఛందంగా చేరిపోయారు. ఫిర్యాదుల నమోదు ప్రక్రియ నిజమయిన ప్రజా ఉద్యమంగా రూపం దాల్చింది. యజమానుల అధికారాన్ని వ్యతిరేకిస్తూ వారివల్ల నష్టపోయిన సుమారు 8,000 మంది రైతులు ఫిర్యాదులు నమోదు చేసారు. అంతేగాక యజమానులు ఇంతకాలంగా వారిపై బలవంతంగా రుద్దుతూ వొచ్చిన అధిక కౌలు పంటను తిరస్కరిస్తూ వెనక్కి తిరిగి ఇచ్చేసారు.

రైతుల్నుంచి ఇలా ఫిర్యాదులు సేకరించే పని గాంధీజీని తన కార్యకర్తలతో సహా పేదరికం తాండవించే వివిధ గ్రామాలకి వెళ్ళేలా చేసింది. అప్పుడే రెక్కాడితేకాని డొక్కాడని ఆ బీదాబిక్కీ రైతులకి తమ పరిస్థితులు మారగలవన్న ఆశ ఎక్కడో చిగురించేది. ఆ సమయంలో ప్రభుత్వ ఉన్నతాధికారి డబ్ల్యూ. మౌడీగారి నుంచీ 10న రాంచీ రావాల్సిందిగా గాంధీజీకి ఆత్మీయ ఆహ్వానం అందింది. సాధారణంగా

అలాంటి చర్చలు, సంప్రదింపులపై గాంధీజీ కెటువంటి వ్యతిరేకతా లేని కారణంగా ఆయన్ని కల్సి చర్చించడమే కాక తన పరిశీలనలను ఒక దరికి చేర్చి ప్రాథమిక నివేదిక కూడా పంపడానికి మాటకూడా ఇవ్వడం జరిగింది. అన్నట్లుగానే ఆయన మే 13న దాన్ని పంపాడు. అయితే రైతుల తదుపరి ఫిర్యాదులపై దృష్టిపెట్టకుండా తన స్వచ్ఛంద కార్యకర్తల సమూహాన్ని రద్దుపరచ వలసిందిగా మౌడీగారు చేసిన సూచనను మాత్రం గాంధీజీ మర్యాదపూర్వకంగానే తిరస్కరించడం జరిగింది.

## నైతిక యుద్ధం:

ఇక ఇప్పుడు యజమాని సంఘాలన్నీ తమ ప్రయత్నాలు మొదలుపెట్టాయి. సామ, దాన, భేద, దండోపాయాలన్నింటినీ ప్రయోగించాయి. రైతుల్ని బెదిరించి భయపెట్టాలని చూసారు. అనేక పుకార్లు, తప్పుడు ప్రచారాల్ని వ్యాప్తి చేసారు. హింసాత్మక సంఘటనలకు పాల్పడ్డారు. చివరికి రాజీయత్నాలకి దిగారు. గాంధీజీ ఎప్పుడైనా యజమానుల్నీ, భూస్వాముల్నీ కలవడానికి సంసిద్ధతను వ్యక్తం చేస్తూ నైతిక బలాన్ని సంపాయించడమే కాక వ్యక్తిగత వ్యవహారాలలో వారి గౌరవ మర్యాదలకు ఎటువంటి భంగం కలిగించకుండానే తాను ఎట్టి పరిస్థితులలోనైనా రైతుల పక్షమేననే విషయాన్ని స్పష్టం చేస్తుండేవారు.

చివరాఖరికి ప్రభుత్వం లొంగిపోయింది. సాక్షాత్తూ బీహార్, ఒరిస్సా గవర్నరు ఏ.గెయింట్, చీఫ్ సెక్రటరీ హెచ్. మెక్‌పెర్సన్‌లు జూన్ 5న రాంచీలో గాంధీజీతో సుదీర్ఘసమయంపాటు చర్చలు జరపడం జరిగింది. ఆ సమావేశం సఫలమయి రైతుల ఫిర్యాదుల్ని పరిగణనలోకి తీసుకుని ప్రభుత్వానికి పంపించడానికీ, తత్సంబంధమయిన విషయ సేకరణకూ ఒక కమిటీ ఏర్పడింది. గాంధీజీతో సహా ముగ్గురు బ్రిటిష్ అధికారులు, యజమానుల తరఫునించి ఒక ప్రతినిధి, భూస్వాముల నుండీ మరో ప్రతినిధీ, అధ్యక్షుడు అందులో ఉన్నారు. గాంధీజీ సేకరించిన సాక్ష్యాధారాలన్నింటినీ దానికి సమర్పించారు. దాని సూచనలు ప్రభుత్వం గౌరవిస్తుందని భావించారు. అంతేకాదు, ఇకపై రైతుల ఫిర్యాదుల్ని సేకరించే కార్యక్రమాన్ని కూడా ఆయన రద్దుపర్చుకోడానికి అంగీకరించారు.

రైతుల ఫిర్యాదుల చుట్టూ అప్పటివరకూ తిరిగిన ప్రజా కదలిక అంతటితో ముగిసింది. కానీ, ఆ ఫిర్యాదుల్ని పరిష్కరించే అసలయిన పని నిజానికప్పుడే

ఆరంభమయింది. మళ్ళీ ఆ కమిటీకి అందుకోసం తగిన శ్రద్ధతో ఉత్సాహాన్ని అందించడం గాంధీజీ పరిణిత నాయకత్వానికి ప్రతీక. కమిటీ సమావేశాలకి తప్పనిసరిగా హాజరవ్వడం మొదలుకుని, సంబంధిత సాక్ష్యాధారాల్ని, సమాచారాన్ని కమిటీ ముందు పెట్టి అది తీసుకోబోయే – నిర్ణయాల్ని సైతం కచ్చితంగా నిర్ధారించేవాడు గాంధీజీ.

గాంధీజీ దృష్టి ఎల్లప్పుడూ యూరోపియన్ యాజమాన్య అక్రమాలపైనే కేంద్రీకృతమయ్యేది. వారి నేరాల్నే ఆయన ఎత్తి చూపేవాడు. మొత్తానికి గాంధీ డిమాండ్ చేసిన 40 శాతానికి కాకపోయినా 25 శాతానికి షరాబ్షి సొమ్ము తగ్గించడానికి యజమానులు సంసిద్ధత వ్యక్తపరిచారు. ఇంతలోనే మిగిలిన 15 శాతం ఎస్టేట్‌ల నించి తీసుకోవాలనే ప్రతిపాదన అధికారుల నుంచి రావడంతో గాంధీజీ దానిని తీవ్రంగా ఆక్షేపించారు. తటస్తంగా ఉండిపోయిన బిహారి జమిందారుల్ని అనవసరంగా నొప్పించాలని ఆయననుకోలేదు. ముగింపుగా 26 శాతం షరాబ్షి రద్దుకి గాంధీజీ అంగీకరించారు.

ఆ కమిటీ అక్టోబర్ 3, 1917న సభ్యులందరి ఆమోదంతో ఒక గొప్ప నివేదికను ప్రకటించడం గుర్తించదగ్గ విషయం. ఐతే, గాంధీజీ కృషివలనే ఆ సమాచారం బయటకొచ్చిందనే నిజాన్ని మరుగుపర్చడం జరిగింది. ఆ నివేదిక టిన్–కతియా విధానాన్ని రద్దుచేసి రైతులు వారికి నచ్చిన పంటను వేసుకునే స్వేచ్ఛనివ్వాలని సిఫారసు చేసింది. ఉత్పత్తి నిష్పత్తిని బట్టి కాక ప్రదేశాన్ని బట్టి ఖరీదుకట్టే చర్యలను తీవ్రంగా దుయ్యబట్టింది. షరాబ్షి అద్దె 26 శాతానికి తగ్గించడం జరిగింది. అదికాక రైతులపై వడ్డీలు విధించే తవాన్ శిస్తు కూడా రద్దుపర్చడం జరిగింది. అబర్‌వాచ్‌ల పేరుతో రైతాంగాన్ని పీడించుకుతినే లెవీపన్నులూ, వడ్డీలన్నీ చట్ట వ్యతిరేకమయినవిగా గుర్తించబడ్డాయి. అతిక్రమించిన వారిపై జరిమానాను గూర్చి కూడా ప్రకటించబడింది. ఇదంతా కాక ముఖ్యంగా, టేకేదార్ల పేరుతో గ్రామీణ దళారీ వ్యవస్థను పోషిస్తూ జమీందారి హక్కులు చెలాయించుతూ రైతాంగాన్ని కాల్చుకుతిన్న యాజమాన్య వ్యవస్థ తొలగించడం జరిగింది. పంటలపై హక్కులు ఆ రకంగా జిత్తులమారులైన యజమానులకి కాక రైతాంగానికి లభించాయి. కమిటీ సమావేశాల్లో నమోదైన విషయాలు కనుక పరిశీలిస్తే, ప్రతీ అంశంలోనూ గాంధీజీ విజయవంతంగా రైతుల పక్షానెలా వాదించారో అర్థమవుతుంది.

**వ్యవసాయ చట్టం:**

కమిటీ ప్రతిపాదించిన ముఖ్యమయిన సిఫారసుల అమలుకు చట్ట సవరణ అవసరమని గుర్తించిన ప్రభుత్వం 1917, అక్టోబరులో చట్టం చేయడానికి ఆదేశించడం జరిగింది. అలా 1918లో చంపారన్ వ్యవసాయ చట్టం రూపొందింది. గాంధీజీ ఆ చట్టం డ్రాఫ్ట్‌బిల్లును పరీక్షించి సూచనలు చేయడం జరిగింది. కౌలుదార్ల ప్రయోజనాల్ని కాపాడేలా కొన్ని విషయాల్ని మార్పు చేయడం జరిగింది. వ్యక్తిగతంగా కూడా చంపారన్‌లో బీద రైతాంగానికి ఒనగూడిన విజయం గురించి ఆయన తృప్తినొందారు.

దక్షిణాఫ్రికాలో 20 సం॥రాల పాటు నిరవధికంగా భారతీయుల పక్షాన నిలబడి పోరాడిన గాంధీజీ సొంత గడ్డమీద కాలుమోపిన తర్వాత మొట్టమొదట చేపట్టిన సత్యాగ్రహ మహోద్యమం చంపారన్. అదక్కడితో ఆగలేదు. స్వదేశీ మిల్లు యజమానులకీ వ్యతిరేకంగా అహ్మదాబాద్ కార్మికులు, రెవెన్యూ వసూళ్ళను నిరసిస్తూ ఖేడా ప్రతిఘటనోద్యమం రెండు సత్యాగ్రహాలు 1918లోనే జరిగాయి; వాటి స్ఫూర్తే 1919 ఏప్రిల్‌లో రౌలత్ చట్టానికి వ్యతిరేకంగా చివరికి 1920–22 సం॥రాల మధ్య సహాయ నిరాకరణోద్యమం, ఖిలాఫత్ ఉద్యమంగా రూపుదాల్చాయి. కానీ, ఏదేమైనప్పటికీ అశాంతి నిండిన రైతాంగానికి నూతన ఆశలు కల్పించీ, అంతిమంగా కష్టజీవులకే ఖచ్చితమైన విజయాన్నందించిన కీలకమైన ప్రజా ఉద్యమంగా, ప్రథమ రైతాంగ పోరాటంగా చంపారన్ సత్యాగ్రహం చరిత్రలో ఎప్పటికీ చిరస్థాయిగా నిల్చిపోతుంది. వంద సం॥రాల తర్వాత, ఈ రోజు కూడా మనం కనక పరిశీలిస్తే చంపారన్ రైతాంగంతో మిళితమై దేనికీ జంకకుండా, ఎవరికీ లొంగకుండా మొక్కవోని దీక్షతో, సడలని ఆశయంతో అంత కచ్చితమయిన దృఢవిశ్వాసాన్ని నిశ్చయమైన మార్గంలో పెట్టుకుని గాంధీజీ సాధించిన విజయానికి ఆశ్చర్యపోయి శిరస్సు వంచి నివాళు లర్పించకుండా నిలవలేము.



# 4. మొట్టమొదటి సత్యాగ్రహం

**- ఆచార్య జె.బి. కృపలాని**

**ప్రముఖ గాంధేయవాది, సోషలిస్టు, పర్యావరణ సామాజిక కార్యకర్త**

(ఏప్రిల్ 30, 2017న భావన్స్ జర్నల్ పత్రికలో ప్రధాన కథనంగా వచ్చింది)

లక్నోలో జరిగిన సమావేశంలో బీహార్‌లోని చంపారన్ నుంచి వచ్చిన రాజ్‌కుమార్ శుక్లా అనే రైతు గాంధీజీకి వారి ప్రాంతంలో రైతులనుభవిస్తున్న కష్టాలు, కడగండ్లను గూర్చి వివరించి చెప్పి నీలిమందు తోటల్లో తెల్లవాళ్ళు స్థానిక ప్రజలపై చెలాయిస్తున్న పెత్తందారీ పద్ధతుల్ని గురించి కూడా తెలియజేసాడు. అప్పుడే గాంధీజీని చంపారన్ వచ్చి స్వయంగా వాస్తవాలు పరిశీలించాల్సిందిగా కోరాడు. అతని మొండిపట్టుతో మొత్తానికి గాంధీజీని ఒప్పించగలిగాడు. అయితే, తాను వెంటనే బయలుదేరి రాలేననీ ఏప్రిల్ మొదటి వారంలో ఒకానొక సమావేశ నిమిత్తం కలకత్తా వెళ్ళాల్సి ఉందనీ, శుక్లా కనుక తననక్కడ కలిస్తే అతనితో చంపారన్ వెళ్ళడానికి సిద్ధమేననీ గాంధీజీ చెప్పారు. పట్టువిడవని శుక్లా ఆయన్ని కలకత్తాలో కలిసాడు. ఇద్దరూ పాట్నా వచ్చారు. ట్రైన్లో గాంధీజీ అక్కడి రైతుల భూమినిబంధనలకి సంబంధించి కొన్ని సందేహాలు వ్యక్తం చేయగా శుక్లా వాటికి సంతృప్తికరమయిన సమాధానాలు చెప్పలేకపోయాడు. అప్పుడు గాంధీ ఆ తోటల పెంపకందారీ యజమానులు, రైతులకి సంబంధించిన చట్టసంబంధిత వివరాలు తెల్సిన వ్యక్తులెవరయినా ఉన్నారా అని శుక్లాను అడిగారు. దానికి శుక్లా జవాబు చెబుతూ పాట్నాలో ఉండే రాజేంద్రబాబు ఒక్కడే ఈ విషయాలు చెప్పగలుగుతాడన్నాడు. స్టేషన్ నుండీ సరాసరి వారు రాజేంద్రబాబు ఇంటికెళ్ళారు. అయితే, దురదృష్టవశాత్తూ, రాజేంద్రబాబు ఇంట్లో లేరు; ఆయనప్పటికే పూరి వెళ్ళి ఉన్నారు. అక్కడి గుమస్తా ఈ అపరిచిత వ్యక్తుల్ని ఇంట్లోకి రానివ్వలేదు. దాంతో వరండాలోనే ఎలాగో సర్దుకోవాల్సి వచ్చింది. నీళ్ళు అపవిత్రమవుతాయనే నెపంతో అక్కడి పనివాళ్ళు గాంధీ, శుక్లాల్ని తాగునీరు కూడా తాకనిచ్చేవారు కాదు. ఇంట్లోది కాక వెలుపలనున్న పాడుబడిన మరుగుదొడ్డినే వాడుకుందుకు సమ్మతించారు. బీహార్లో కులతత్వం అంత క్రూరంగా కోరలు చాపి బుసకొడుతుండేది. అక్కడుండగా గాంధీకి లండన్‌లో మజహర్-ఉల్-హక్ అనే

సహపాఠి పాట్నాలోనే ప్రాక్టీసు చేస్తున్న సంగతి జ్ఞాపకమొచ్చింది. 1915లో అతడు బొంబాయిలో కల్సి పాట్నాకి ఆహ్వానించిన విషయం గుర్తొచ్చి, తన దురవస్థను వివరిస్తూ ఒక చీటీ రాసి శుక్లా చేతికిచ్చి పంపారు. అదందింలో లేదో మజహల్-ఉల్-హక్ ఆఘమేఘాల మీదొచ్చి గాంధీజీ ఎదుట వాలిపోయాడు. గాంధీ, శుక్లాలిద్దర్నీ ఇంద్రభవనం వంటి తన ఇంటికి తీసుకుపోయాడు. అంతేకాక, పంట యజమానులు, రైతులకి సంబంధించీ ముఖ్యమైన వివరాల్ని అందించాడు. అక్కడి రైతులు పడుతున్న ఇబ్బందులూ, వార్ని నియంతలుగా వేధిస్తున్న యజమానుల అకృత్యాలను వీలైనంత తొందరగా పరిశీలించి గాంధీజీ తిరిగి అహ్మదాబాదు వెళ్ళిపోవాలనే ఆలోచనలో ఉన్నారు. మజహర్-ఉల్-హక్ గాంధీజీతో నీలిమందు పంట యజమానులకి మజఫర్‌నగర్‌లో నివాసగృహ సముదాయాలున్నాయని చెప్పి అక్కడెవరైనా తెల్సిన వాళ్ళున్నారేమో వాకబు చేసాడు. గాంధీజీ అక్కడ స్థానిక కళాశాల ప్రొఫెసర్ కృపాలనీ తెలుసని చెప్పి, అప్పటికప్పుడే తాము బయలుదేరి ట్రైన్లో అర్ధరాత్రి చేరుకోబోతున్నట్లుగా నాకో టెలిగ్రాం పంపారు. రాత్రి ఇంటికి చేరుకున్నాక సుమారు 9 గంటలప్పుడు నేనా టెలిగ్రామ్‌ని చూసి కంగారుపడ్డాను. ఇంత ముఖ్యమైన అతిథిని ఎలా స్వాగతించాలి? ఆయన్ని ఎక్కడ ఉంచాలి? కాలేజీ హాస్టల్‌కి నేనక్కడ వార్డెన్‌గా ఉండేవాడ్ని. ఆ వసతి గృహంలోనే రెండు చిన్న గదుల్లో నా సామానులతో సహా ఉండేవాడ్ని. అయితే, అక్కడి విద్యార్థులు నేను స్టేషన్‌కి ఒక ప్రముఖ వ్యక్తిని అతిథిగా తీసుకురావడానికి వెళుతున్నాననే విషయం గ్రహించి అడిగారు. వాళ్ళకి నేను గాంధీ గురించి చెప్పాను. అంతే, వాళ్ళు కూడా అంతరాత్రి నాతో వచ్చి భారతీయ సాంప్రదాయ గౌరవ చిహ్నమయిన మంగళహారతిని గాంధీజీకి ఇస్తామన్నారు. అప్పటికప్పుడే మంగళహారతికి కావాల్సిన వాట్ని కూడగట్టారు. ఐతే, కొబ్బరికాయ మట్టుకు బజార్లో కూడా దొరకలేదు. అప్పుడు వసారాలో ఉన్న కొబ్బరిచెట్టెక్కి కొన్ని కాయలు తెంపి ఆ లోటును నేను పూడ్చాను. అంతటితో మంగళహారతికి కావాల్సిన ఏర్పాట్లు పూర్తయ్యాయి. విద్యార్థి సమూహంతో కల్సి వేడుకగా స్టేషనుకెళ్ళాం. ట్రైన్ వచ్చీ రాగానే గాంధీజీ కొరకు అందరం వెతకడం మొదలెట్టాం. ఆయనెక్కడా అగుపించలేదు. నేనొక్కడ్నే ఆయన్ని గుర్తుపట్టగలను, ఆయనెలా ఉంటాడో కొంచెమైనా నాక్కొక్కడికే తెలుసు. బీహార్ రైళ్ళ రద్దీవలనా, గాంధీజీ మూడోతరగతిలో నుంచి దిగడం వలనా అప్పటికే ఆయన జనసమూహంలో కల్సిపోయుంటారని భావించి గాంధీజీ గురించి

అక్కడున్న గార్డుని అడగ్గా, ఆయనెవరో తనకి తెలీదన్నాడు. అయితే, రైలు దిగిన గాంధీ జనాల మధ్య నుంచి శుక్లాను అంతమంది యువకులెందుకున్నారో కనుక్కోమన్నాడు. వాళ్ళనడిగితే తాము గాంధీజీ కోసం ఎదురుచూస్తున్నామని బదులిచ్చారు. ఆ విషయం శుక్లా గాంధీకి చెప్పాడు. మొత్తానికి అలా గాంధీని కలిసాను. ఏవో కాగితాలతో కూడిన మూటను ఆయన మోస్తుండగా, వాళ్ళ పరుపులు శుక్లా పట్టుకున్నాడు. విద్యార్థులు వెంటనే మంగళహారతి కార్యక్రమం మొదలుపెట్టారు. ఆ తతంగమంతా గాంధీజీకి చికాకు తెప్పించింది. బహుశా హారతి దేవుళ్ళకిచ్చేది కాబట్టి కావొచ్చు. కానీ ఈ దేశంలో ఆయన ఇలాంటివాటికి అలవాటుపడాలి. హిందువులు దేవుళ్ళనీ, మహాత్ముల్ని కొద్దిపాటి వ్యత్యాసంతో ఒక్కలాగే చూస్తారు.

ఒక జమీందారీ మిత్రుడు కూడా అదే ట్రైన్‌లో వచ్చాడు. అతడికోసం స్టేషన్‌కొచ్చిన బండిని గాంధీగార్ని తీసుకొనిపోవడం కోసం ఉంచేయవలసిందిగా నేనాయన్ని అభ్యర్థించాను. ఆ గుర్రపుబగ్గీ వద్దకు వెళ్ళగానే విద్యార్థులు దాని నుంచి గుర్రాన్ని వేరుచేస్తూ కనిపించారు. ఆ రోజుల్లో మహనీయులెక్కిన బగ్గీలను వారి అభిమానులు, ఆరాధకులు లాగుతూండేవారు. అప్పటిదాకా అంతటి సర్వసాధారణమైన గౌరవాన్ని తిరస్కరించిన వారెవరూ నాకు తారసపడలేదు. అలా నేను చూసిన మొట్టమొదటి వ్యక్తి గాంధీజీ. విద్యార్థులు కనుక దాన్ని లాగేటట్లయితే ఆయన బగ్గీలోకి ఎక్కనని భీష్మించాడు. విద్యార్థులు మరీ మొండికేస్తే సత్యాగ్రహం మొదలెడతాడేమోనని నేను భయపడ్డాను. ఆయన్ని బలవంతపెట్టొద్దని వారితో చెప్పాను. ఆ బగ్గీ పూర్తిగా మూసి ఉంది. గాంధీ, నేనూ అందులో ఎక్కాం. అది కదలడం మొదలెట్టింది. పాట్నాలో జరిగినదంతా గాంధీ పిచ్చాపాటీగా నాతో చెబుతున్నారు. నాకేమో గుర్రపు పరుగు చప్పుడు వినిపించకపోయేసరికి విషయం అర్థమైంది. గాంధీజీ సూచనను విద్యార్థులు పాటించకుండా బగ్గీని లాక్కుంటూ హాస్టల్‌కి చేర్చారు. బయటికొచ్చిన గాంధీ తాను మోసపోయానన్నాడు, విద్యార్థులే బగ్గీని లాగుతున్నారని తనకి తెలిసిన పక్షంలో కాలినడకన అక్కడికొచ్చేసేవాడ్నన్నాడు.

నా సహోద్యోగి ప్రొఫెసర్ మల్కానిగారి ఇంట్లో గాంధీజీ ఉండడానికి నేను తగిన ఏర్పాట్లు చేసాను. ఆయన ఆ వసారాలోనే ఒక ఇంట్లో పై భాగంలో ఉంటా నన్నాడు.

ఆయన కుటుంబ సభ్యులు లేరు. ఆ ఇంటి కింది భాగంలో మరో సహోద్యోగి ఉంటున్నారు. ఉదయం లేచాక తన ఇంటి పై భాగంలో గాంధీజీ ఉన్న విషయం తెల్సుకున్న అతగాడు ఒక్కసారిగా ఎంత భయపడిపోయాడంటే వెనువెంటనే ఇంటిని వొదిలి పారిపోయాడు. ఉద్యోగం మీద బెంగతో మల్కాని డీలాపడిపోయాడు. ఐతే, తర్వాత కాలంలో సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభమయిన తర్వాత అతడు తన ఉద్యోగానికి రాజీనామా చేసి ఉద్యమంలో చేరడం జరిగింది. మల్కానీని ధైర్యంగా ఉండమని గాంధీజీ నా అతిథిగా వచ్చారనే విషయాన్ని ప్రిన్సిపాల్‌తో నేను చెబుతానని చెప్పాను.

అన్నట్టుగానే కాలేజీ తెరిచిన వెంటనే నేను ప్రిన్సిపాల్‌గారి దగ్గరకెళ్ళి గాంధీజీ నా అతిథిగా అక్కడికి వచ్చి ఉన్నారని చెప్పాను. ఆయన "దక్షిణాఫ్రికా నుంచీ వార్తల్లోకెక్కిన ఆ వివాదాస్పద వ్యక్తి గాంధీ నీ అతిథిగా ఉన్నారంటున్నావా?" అనడిగాడు. నేను వెంటనే ''అవుననే'' జవాబుచెప్పి, ''మీరాయన్ని వివాదస్పదుడని ఎందుకనుకుంటున్నారు? చక్రవర్తి ఆయన సేవలకు మెచ్చి కైసర్-ఎ-హింద్ పురస్కారాన్ని ఆయనకివ్వడం జరిగింద"ని చెప్పాను. ప్రిన్సిపాల్ తలూపి ఆయన కోసం వేరే ఏర్పాటు చేసుకోమని సెలవిచ్చాడు. భారతదేశంలో ఇంటికొచ్చిన అతిథిని హోటల్‌కు పంపడం అమర్యాదకరమని చెప్పాను. ఇంతాచేసి, ఆ పట్టణంలో అప్పటికి ఒక్క హోటలు కూడా లేదు. ఇదంతా చెప్పి ఆయన మానాన ఆయన్నొదిలి నా అతి ప్రవర్తనకు పరిణామాలూహించుకుంటూ నేను వెనుతిరిగి వచ్చేసాను. గాంధీజీ తన స్వీయచరిత్రలో నన్ను ఆ కాలేజి ప్రిన్సిపాల్‌గా పేర్కొన్నారు. కానీ నిజానికి అక్కడ నేను అధ్యాపకుడ్ని మాత్రమే. ఆ రోజుల్లో ఒక భారతీయుడు ప్రిన్సిపాల్‌గా ఎన్నిక చేయబడటం అనూహ్యమైన విషయం. ఆయనింకా నేను మల్కానీగారితో కల్సి ఉంటున్నట్టు పేర్కొన్నారు. అది కూడా సరికాదు. ముందే చెప్పినట్లుగా నేను కాలేజీ హాస్టల్లో ఉంటుండేవాడ్ని.

అక్కడి రైతులు - యజమానుల సమస్య గురించి నాకేమయినా తెలుసునేమోనని గాంధీజీ నన్నడిగారు. ఐతే, రైతుల్ని తెల్ల యజమానులు క్రూరంగా పీడించుకు తినడమొహటే నేనెరుగుదుననీ, తతిమ్మా విషయాలేవీ నాకు తెలీవని చెప్పాను. ఆ రోజుల్లో గ్రామాల్లో ఏం జరుగుతోందో, అక్కడి వాస్తవ స్థితిగతులేమిటో మాకు తెల్సేది కాదు. మా దేశభక్తి అలా ఏడ్చేది. కొద్దోగొప్పో చదువుకున్న విద్యావంతులం అందరం కూడా సమాజానికి దూరంగా జీవితాలు వెళ్లదీసేవాళ్ళం. మా లోకమంతా

ఇరుకైన నగరాల్లో విద్యావంతుల గుంపులకే పరిమితమయ్యేది. ప్రజల్ని గురించి మా జ్ఞానమంతా పనిమనుషులతో, సేవకులతో మాట్లాడి అత్తెసరుగా వొంటబట్టించుకొని, వారేదోనాడు పరాయి పాలనను తోసిరాజనడానికి ఉత్సాహంగా ఉన్నారనే అరకొర సమాచారం మాత్రమే.

చంపారన్‌లో భూసమస్యను వివరించేందుకు కొందరు న్యాయవాద మిత్రులకి కబురంపుతానని నేను గాంధీజీతో చెప్పాను. రైతులకీ – యజమానులకీ కల వివాదాంశాల్ని వారైతే సమర్థవంతంగా విశ్లేషించగలరని అన్నాను. గాంధీజీ అందుకు ఒప్పుకోగానే నేను కొద్దిమంది నా లాయరు మిత్రుల్ని ఆయన్ని కలవడానికి ఆహ్వానించాను. వారిని అనేక ప్రశ్నోత్తరాలతో విసిగించిన తర్వాత గాంధీ యజమాన్య సంఘ కార్యదర్శిని కల్సి తనకి సహకరించాల్సిందిగా కోరారు. ఐతే, చంపారన్ ప్రాంతానికి తానొక 'పరాయ వ్యక్తిననీ' తను అక్కడికి రావడం మంచిదికాదని కార్యదర్శి అన్నాడు. దానికి గాంధీజీ బదులిస్తూ ఒక బాధ్యత గల భారతీయుడిగా ఎట్టి పరిస్థితుల్లోనూ తనని తాను పరాయివ్యక్తిగా పరిగణించుకోవడం తగదని అన్నారు. ఏదేమయినా రైతు సమస్యల్ని స్వయంగా చూసి కానీ వెనుదిరగకూడదనే నిర్ణయానికొచ్చారాయన. గాంధీ తర్వాత అనుమతి తీసుకుని తిర్‌హుట్ ప్రాంతపు కమిషనర్‌ని కలిసారు. చంపారన్ జిల్లా తిర్‌హట్ ప్రాంతం పరిధిలోకే వస్తుంది. కమీషనర్ గాంధీని గౌరవించకపోగా తన అధికార దర్పాన్ని ప్రదర్శిస్తూ వెంటనే ముజఫర్‌నగర్ వొదిలి వెళ్ళాల్సిందని చెప్పాడు. ఆయనక్కడుండటం సమస్యల్ని సృష్టిస్తుందన్నాడు. గాంధీజీ అటువంటిదేమీ జరగదని హామీ ఇస్తూ తాను చంపారన్ వెళ్ళబోతున్నట్లు చెప్పారు.

మరుసటిరోజు మళ్ళీ వొచ్చిన నా లాయరు మిత్రులు గాంధీజీ పట్టణంలో తమ ఇంట్లో ఉంటే బాగుంటుందనే ఆలోచన వెలిబుచ్చారు. ఆయనకి కూడా సౌకర్యవంతంగా ఉంటుందనే భరోసా ఇచ్చారు. ఈ ఆలోచన మొదట ప్రిన్సిపాల్ చేత సూచించబడిందనే విషయం నాకు జ్ఞాపకం వచ్చింది. నిజానికి పట్టణం నుండీ కాలేజీ కిలోమీటరు దూరం కూడా లేదు. మొత్తానికి గాంధీజీ లాయరింటికి మారారు. ముజఫర్‌నగర్‌లో మూడ్రోజులున్నారు. ఆ సమయంలో ఆయన్ని కలవడానికి మా కళాశాల సంస్కృత ఆచార్యులవారు విచ్చేసారు. మాటల మధ్య అంత చదువుకున్న పండితుడూ ఆవుపాలు తీసుకుంటే గోమాంసం తిన్నంతబలం అనేసరికి గాంధీజీ

విస్తుపోయారు. తర్వాత నేను పండితునితో మాట్లాడుతూ వైదిక ఆర్యులు గోమాంస ప్రియులేననీ, ఉపనిషత్తుల్లో అందుకు సంబంధించిన ఆధారాలున్నాయని అన్నాను, ఆ పండితుడు బదులేమీ ఇవ్వకుండా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. ఈ సంఘటనని ఇప్పుడిక్కడ చెప్పడానికి కారణముంది. వైదిక ఆర్యులు గోమాంసం తిన్నారా లేదా అనే అంశంపై ప్రస్తుతం వివాదం నడుస్తోంది. అందుకే దీన్నిక్కడ ప్రస్తావించాను. ఆ పని చూసుకున్న తర్వాత గాంధీజీ అక్కడున్న లాయర్లను చంపారన్ వచ్చేందుకు ఆసక్తి ఉందేమోనని అడిగారు. అక్కడి స్థానిక భాషను తేలిగ్గా అర్థం చేసుకోడానికీ, అలాగే సమాచారాన్ని నమోదు చేసుకోడానికీ వారు సహాయంగా ఉంటారని ఆయన భావించారు. చట్టాన్ని అతిక్రమించి జైలుకెళ్ళే కార్యక్రమం కనుక లేకుండా ఉంటే రావడానికి అభ్యంతరం లేదని వారు తెలిపారు. అందుకు గాంధీ నవ్వుతూ, "అక్కడ సత్యాగ్రహం చేయాల్సొంటుందనీ నేననుకోవడం లేదు. ఒకవేళ, తప్పనిసరై అలాంటి సందర్భం కనుక తలెత్తితే మిమ్మల్ని చట్టాన్ని అతిక్రమించమని నేను కోరను" అని బదులిచ్చారు.

జిల్లా కేంద్రమైన మోతిహరీకి గాంధీ వచ్చీరాగానే అక్కడి దుర్భర పరిస్థితుల్ని తెల్సుకోవడం కోసం మారుమూల గ్రామాలకి వెళ్ళాలని తలిచారు. మార్గమధ్యలో చంపారన్‌ని 24 గంటల్లోపల విడిచిపెట్టి వెళ్ళిపోవాలనే నోటీసు కూడా అందుకున్నారు. తానొచ్చిన పనిని మధ్యలో వొదిలి చంపారన్ నుండి వెళ్ళే ఆలోచన తనకి లేదనీ గాంధీజీ జిల్లా మెజిస్ట్రేట్‌కి జవాబు పంపారు. ఆ వెంటనే, మరుసటిరోజు తనముందు హాజరుకావాలనీ జిల్లా మెజిస్ట్రేట్ నించి గాంధీకి సమన్లందాయి. మర్నాడు విచారణ మొదలైందో లేదో ప్రభుత్వం తరఫు న్యాయవాది తన పరిజ్ఞానాన్నంతా వినియోగించీ గాంధీజీ చట్టాన్ని అతిక్రమించారని రుజువు చేయడానికీ ఉత్సాహం చూపాడు. గాంధీజీ కానీ ఆయన తరఫు వకీళ్ళు కానీ నిర్దోషిత్వాన్ని నిలుపుకోడానికి వాదనలతో తంటాలు పడుతుంటే చూసి ఆనందిద్దామనుకున్న ఆ లాయరు ఆశలు కోర్టు ఆశల్లాగానే అడియాశలయ్యాయి. వార్ని తెల్లబోయేలా చేస్తూ గాంధీ తన నేరాన్ని అంగీకరించాడు. తాను చంపారన్ రాడానికి గల కారణాల్ని చెబుతూ "మానవతా దృక్పథంతో జాతికి నా వంతు సేవ చేయడానికి వచ్చాను. అయితే సమస్య గురించి తెల్సుకోకుండా నేనేవిధమైన సహాయము చేయలేను. చట్టాన్ని గౌరవించే పౌరుడిగా అధికారిక ఉత్తర్వుల్ని నేను పాటించాల్సి ఉంది. కానీ, నేనెవరి కోసమైతే వచ్చానో వారి మానాన వారినొదిలి క్రూరంగా ప్రవర్తించి నా అంతరంగానికి విరుద్ధంగా వెళ్ళడానికి నేను

సిద్ధం కాలేదు. వాళ్ళ మధ్యన వాళ్ళతో ఒకడిగా మసలడం ద్వారానే వాళ్ళ కష్టాలు గ్రహించగలిగి తద్వారా వారికేదైనా చేయగలనని నేను భావించాను. ఈ నా భావాన్నిక్కడ వెలిబుచ్చింది నా శిక్షను తగ్గిస్తారని కాదు, నిర్లక్ష్యంగా వ్యవహరించి అధికారాజ్ఞలను ఉపేక్షించింది చట్టపరమయిన ప్రమాణాలను కించపరచడానికి కాదు, అంతకంటే ఉన్నతమయిన ప్రమాణం అందరికీ ఉండే ఆంతరిక న్యాయస్థానమైన **అంతర్వాణి** చెప్పింది పాలించేందుకే అలా చేసాను" అన్నాడు.

మెజిస్ట్రేటు స్థిరంగా ఉన్నాడు. గాంధీజీ అధికారపరమయిన వ్యవహారాల్లో తన అంచనాలు తప్పినట్లుగా నిరుత్సాహానికి గురయ్యాడు. అధికారిక ఆజ్ఞలు ఆయనకి పంపడం, వాటినాయన తిరస్కరించడం, కోర్టుముందు విచారణకి హాజరు కావడం ఒక్క చంపారన్‌లోనే కాదు, దేశం మొత్తం వార్తయింది. చుట్టుపక్కల ప్రాంతాల నుండీ వేలసంఖ్యలో రైతులు యజమానులు, పోలీసులంటే భయం లేకుండా కోర్టుకి రావడం మొదలెట్టారు. తమకోసం ఖైదు కావడానికి కూడా సిద్ధపడి న్యాయస్థానం బోనులో దోషిగా నిలబడ్డ అద్వితీయ వ్యక్తిపట్ల వారి విధేయతను చూపడానికి రైతులు తండోపతండాలుగా తరలి రాసాగారు. ఆయన వల్లనే వారి సమస్యలు తీరిపోగలవని వాళ్ళాశించారు.

ఆ రోజుల్లో సిమ్లాలో ఉండే ప్రభుత్వ యంత్రాంగం ఎప్పటికప్పుడు ఈ జరుగుతున్న పరిణామాల్ని తెల్సుకుంటుండేది. గాంధీజీ కూడా సమాచారాన్ని వైస్రాయికీ మాలవ్యాగారికీ, పాట్నాలోని యితర మిత్రులకీ చేరవేసేవారు. అప్పటికింకా మొదటి ప్రపంచయుద్ధం ముగియలేదు. దేశంలో ఎక్కడా కూడా రాజకీయపరమైన గంభీరవాతావరణం నెలకొనడాన్ని ఉన్నతాధికారులు హర్షించడం లేదు. గాంధీజీ విచారణ సందర్భంగా ప్రజానీకంలో కనిపించిన స్పందనను చూసిన ప్రభుత్వం వారిలో అశాంతి ప్రభలుతుందేమోనని ఆందోళన చెందింది. తీర్పు వాయిదా వేసి, గాంధీజీకి సమాచార సేకరణకు స్వేచ్ఛనిచ్చి విడుదల చేసింది.

చరిత్రలో మొట్టమొదటిసారిగా బ్రిటీష్ ప్రభుత్వాన్ని దాని న్యాయస్థానంలోనే సవాలు చేసిన సంఘటన జనాల్లో సంచలనమైంది. జైలు, శిక్షలకి భయపడకుండా సాక్షాత్తూ ధర్మాసనానికి ఎదుటనిల్చి తన ధర్మమేమిటో చెప్పగలిగిన ధీరుడ్ని చూసి యావత్ భారతావని పులకించిపోయింది. భారతదేశంలో అటువంటి సంఘటన అంతకుముందు జరిగి ఉండలేదు. ఏ రాజకీయ నాయకుడో, కార్యకర్తో అరెస్టయితే

అతడు తన వాదన వినిపించేందుకు లాయర్ని పెట్టుకునే వాడు. అలాగే తన వాదనను బలంగా వినిపించిన లోకమాన్య తిలక్ విచారణ గురించి కూడా విదితమే.

న్యాయస్థానంలో గాంధీజీ ధిక్కార స్వరాన్ని చూసిన చంపారన్ రైతులు దీర్ఘకాలికంగా వార్ని పట్టి ఉంచిన బానిస బంధనాల నుండి విముక్తయినట్లు భావించారు. ఈ అంశంపై రాస్తూ గాంధీ తన ఆత్మకథలో "ఆనాడు మోతిహారిలో జరిగిన అపూర్వ సంఘటనలు తల్చుకుంటే నేటికీ ఒళ్ళు జలదరిస్తుంది... ఆ రైతులు చాలాకాలం నుంచి నన్నెరిగిన ఆప్తమిత్రుల్లాగా నన్ను స్వాగతించారు. ఆ రోజు జరిగిన సభలో అతిశయోక్తికని కాకుండా, అత్యుత్సాహానికి తావు లేకుండా చెప్పాలనంటే నేను విశ్వసించే దేవుడ్నీ, సత్యాన్నీ, అహింసని అక్కడ దర్శించా ననిపించింది. ప్రజల ప్రేమకు పాత్రుడినైనందువల్లనే ఆ స్థితికి రాగలిగానని నేననుకున్నాను. అహింస మీద నేను తిరుగులేని విశ్వాసాన్ని ఏర్పర్చుకోడానికదే తొలిమెట్టు. ఆ రోజు చంపారన్ నా జీవితంలోనూ, పేద రైతుల జీవితాల్లోనూ ఎప్పటికీ గుర్తుండిపోతుంది. అహింస దిశగా నా దృక్పథానికి శక్తిని చేకూర్చి మలుపు తిప్పిన మహత్తర దినమది. చట్ట పరిభాషలో చెప్పాలంటే అప్పుడు నేను ప్రభుత్వం యొక్క విచారణలో ఉన్నట్లు, కానీ నిజం చెప్పాల్సి వస్తే ప్రభుత్వమే విచారణలో ఉంది. నా కోసం తీసిన గోతిలో పాపం కమీషనరు తన ప్రభుత్వాన్నే తోసేసాడు."

గాంధీజీ అరెస్టు కావడం, విడుదల చేయబడటం, సమాచార సేకరణకి అనుమతించబడటం రైతుల సమస్యకి అనూహ్యమయిన ప్రచారాన్ని తీసుకొచ్చాయి. దాంతో యజమానులకు కోపమొచ్చింది. వారు గాంధీజీకి సహాయంగా వచ్చిన బ్రెజ్‌కిషోర్‌బాబు, ఇంకా ఇతర లాయర్లపై ఆంగ్లో-ఇండియన్ పత్రికల ద్వారా పథకం ప్రకారం తప్పుడు కథనాలు వ్రాసి ప్రచారం చేసారు. అలాంటి సున్నితమయిన సమస్యను గాంధీజీ పరిష్కరించిన తీరు సహాయ నిరాకరణోద్యమానికో ప్రత్యక్ష పాఠం. అందుకే అది అగణిత ప్రజానీకాన్ని నాడు ఆకర్షించింది. గాంధీజీ ఎప్పుడూ - తన పనిలో అత్యుత్సాహం ప్రదర్శించే కాంగ్రెస్‌కానీ, పత్రికలు గానీ జోక్యం చేసుకోవడాన్ని ఇష్టపడేవారు కాదు. ప్రధానమైన పత్రికలన్నింటికీ వాటి ప్రతినిధుల్ని చంపారన్ పంపవద్దని ఆయన లేఖలు రాసారు. ప్రచురణ కోసమనే కాక సమాచారం ఇచ్చే నెపంతో ఎప్పటికప్పుడు ఆయనే పత్రికలన్నింటికీ స్వయంగా సంక్షిప్త వివరాలు రాసి పంపుతుండేవారు. ఆ కారణంచేతనే మాలవ్యాగారికి సహాయం చేయడానిక్కూడా ఆయన వెళ్ళలేకపోయారు. **'రాజకీయరంగు పులుముకోవడంతోనే మానవతావాదం**

**నష్టపోతుంద'ని ఆయన నమ్మేవారు. అలాగే 'నిస్వార్థంగా చేసే ఎటువంటి సేవయినా, అదే రంగంలోనయినా సరే రాజకీయంగా దేశానికి సాయపడుతుందని'** ఆయన విశ్వసించేవారు. సున్నిత సమస్యల గురించి మాట్లాడేటప్పుడూ, వాటిపై స్పందించే టప్పుడూ గాంధీజీ విధానమెలాంటిదో ఈ భావాల్ని బట్టి తెలుస్తుంది. అంతేకాదు తోటల యజమానులు, వారి వత్తాసు పత్రికలు చేసే విమర్శల్నీ, దుష్ప్రచారాన్నీ ఆయన పట్టించుకునేవాడు కాదు. ఒక్కసారి మాత్రం ఆయన దుస్తుల్ని గురించి వాళ్ళు చేసిన విమర్శలకి జవాబిచ్చాడు. "చంపారన్‌లో నేనేసుకునే బట్టలు భారతదేశంలో ఎల్లప్పుడూ నేను వేసుకునేవే. వ్యవసాయదారులైన రైతులపై ప్రత్యేక ప్రభావాన్ని కల్గించేందుకే దుస్తులు ధరించాననీ ఇర్విన్‌గారు పంపిన లేఖలో సైతం పేర్కొనబడింది. నిజమేంటంటే, నేనీ స్వదేశీ దుస్తులు ఎందుకు ధరిస్తానంటే, ఇవి చాలా సహజమైనవే కాక భారతీయతకి అద్దం పడతాయి. విదేశీ వస్త్రధారణను అనుకరించడం మన పతనానికి చిహ్నమని నేను నమ్ముతాను. భారతీయ వాతావరణానికి సరిపడే, ఆకర్షణీయమయిన, చౌకైన, నిరాడంబరమయిన, భూమ్మీద దేనికీ సాటిరాని దుస్తుల్ని వేసుకోకుండా విడిచిపెట్టడం ద్వారా, వాట్ని చులకనగా తులనాడటం ద్వారా మనమంతా జాతిపట్ల ఘోరమయిన పాపం చేస్తున్నామనేది నా భావన. అధికార కాంక్షతో, తప్పుడు అవగాహనతో ఆంగ్లేయులు భారతీయ సరళిని అనుకరించారు కాదా. అలాగే మరో విషయం, నేను చంపారన్ ఉత్తకాళ్ళతో వెళ్ళట్లేదు. మామూలుగానైతే కొన్ని ధార్మికమైన కారణాల వలన నేను పాదరక్షలు వేసుకోవడం మానేసాను. ఐతే, వాట్ని వాడకుండా వుండటమే సహజంగా, ఆరోగ్యంగా బాగుందని గమనించి పూర్తిగా తొడుక్కోడం మానుకున్నాను" అని రాసాడు. స్వదేశీ దుస్తుల పట్ల ఇవీ గాంధీజీ భావాలు. భారతీయ వస్త్రాలపై ఆయన ఆలోచనల్నివి ప్రతిబింబిస్తాయి.

మళ్ళీ తన కథనాన్ని కొనసాగించడానికి చంపారన్‌లో బాధలుపడి ఫిర్యాదు చేసిన రైతుల సమస్యలు అర్థం చేసుకోవడం అవసరం. భూస్వాధీన ఒడంబడికల గురించి తెల్సుకోవాలి. బెంగాలు ప్రాంతంలాగానే బీహారులో కూడా జమీందారీ విధానం అమలులో ఉండేది. భూములన్నీ వారి ఆధీనంలోనే ఉండేవి. వాళ్ళు ప్రభుత్వానికి నిర్ణయించబడ్డ సొమ్ములు చెల్లిస్తుండేవారు. చంపారన్‌లో అత్యధిక శాతం భూమి చెటియా ప్రాంతపు రాజాగారికి చెందినది. కొద్దిమంది సమర్థులైన ఆంగ్లేయులు రాజుగార్ని ప్రేరేపించీ ఆ భూమిని దీర్ఘకాలానికిగానూ, బాగా చౌకగా కౌలుకి తీసుకున్నారు. యూరపులోలా మాంచి గిరాకీగల నీలిమందును పండించాలను

కున్నారు. వారు రైతులకి తిరిగి నిర్దిష్టమయిన సొమ్ముకు ఇస్తూ ప్రతి ఒక్కరూ 3/20 నిష్పత్తిలో పండించాలనే నిబంధన విధించారు. నేలసారాన్ని అధిక మొత్తంలో పీల్చేసుకునే నీలిమందును రెక్కలు ముక్కలు చేసుకుని సాగుచేసినప్పటికీ తోటల యజమానులు రైతులకు నామమాత్రపు ధరనే చెల్లించేవారు. అంతేకాక, అప్పుడప్పుడూ యజమానుల కోసం తాము తీసుకోని భూమిలో కూడా రైతు పనిచేయాల్సి వచ్చేది. 'అబ్‌వాబ్స్' పేరుతో సంప్రదాయిక రుణాల్ని చెల్లించాల్సి వచ్చేది. ఒకవేళ ఎవడైనా రైతు కనక చనిపోతే తర్వాతి రైతు మరణసుంకాన్ని చెల్లించాల్సి వచ్చేది. యజమాని ఏ గుర్రాన్నో, ఏనుగునో కొంటే దాని ధరను రైతులంతా సమానంగా భరించాల్సి వచ్చేది. యజమాని వేసవి విడిదికి కొండపైకి విహారయాత్రకి వెళితే ఆయన ఖర్చులను రైతులే భరించాల్సి వచ్చేది. అన్ని రకాలుగా రైతులు దోచుకోబడుతుండేవారు. రకరకాల సాకులతో పీల్చుకోబడుతుండేవారు. యజమానుల పొలంలో పనిచేసినందుకుగానూ రైతుకూలీలు ఎద్దులబండి, దాన్ని తోలేవాడికి కలిపి రోజుకి నాలుగణాలు పొందుతుండేవారు. రైతులపై కోపమొచ్చినప్పుడల్లా యజమాని మనుషులు గ్రామాలపై ఇష్టానుసారం దాడులు చేసి, వాళ్ళ ఇళ్ళను నాశనం చేయడం, వారి స్త్రీలను చెరబట్టి అవమానించడం, పంటని పాడుచెయ్యడం లాంటి పనులు చేస్తుండేవారు. భారతీయుడు, అతడి హోదా ఏదయినా కానివ్వండి, యజమానుల సమక్షంలో గుర్రంపై స్వారీ చేయడానికి గానీ, గొడుగు వేసుకు వెళ్ళడానికి గానీ ధైర్యం చాలేది కాదు. ఉన్నత విద్యనభ్యసించిన భారతీయులు సైతం వారి వసారాలో చాలా జాగ్రత్తగా తమ పాదరక్షల చప్పుడు ఎక్కడ వినిపిస్తుందోనన్నట్లుగా జంకుతూండేవారు. యజమాని ఇళ్ళలోకి ఏ భారతీయుడూ అనుమతించబడేవాడు కాదు. భారతీయ అధికారులకు కూడా యిందుకు మినహాయింపు లేదు. ఉన్నతాధికారులంతా బ్రిటీషువారే. పైగా వారిలో కొద్దోగొప్పో యజమానులంటే సద్భావం కలవారు నీలిమందు వ్యాపారంతో సన్నిహిత సంబంధాలు కలిగి కూడా ఉండేవారు.

ఏమైతేనేం, జర్మనీలో కృత్రిమ సింథటిక్ రకం అద్దకం అభివృద్ధి అయినప్పట్నుంచీ నీలిమందు వ్యాపారం క్రమంగా పడిపోతూ వచ్చింది. టిన్‌కతియా, 3/20 విధానాలు మాత్రం కొనసాగాయి. చెరుకుపంట మొదలుకొని వివిధ వాణిజ్య పంటలు కూడా యజమానులు ఆరంభించడం రైతులు కళ్ళెదుటే జరిగిపోయింది.

బ్రెజ్‌కిషోర్‌బాబు, రాజేంద్రబాబు ఇద్దరూ కూడా తర్వాతి కాలంలో గాంధీజీ బాటలో నడుస్తున్న న్యాయవాదుల సమూహంలో చేరిపోయారు. గాంధీజీ కోర్టు

ముందు విచారణకొచ్చేటప్పటికి కొద్దిమంది స్థానిక న్యాయవాదులు కూడా తమవంతు సాయం చేసేందుకు ముందుకొచ్చారు. వారిలో గోరఖ్‌బాబుగారైతే గాంధీజీ ఇంటి సరంజామా సమకూర్చి ఆతిధ్యమిచ్చేందుకు ముందుకొచ్చారు. తోట యజమానులు, వారి మనుషుల వల్ల అనుభవించిన హింస, గ్రామాలపై వారి అకృత్యాలు, స్త్రీలపై వారి అఘాయిత్యాలకి సంబంధించీ సమాచారాన్ని సేకరించి సాక్ష్యాలు నమోదు చేసుకునే కార్యక్రమం ఈ న్యాయవాదులంతా మొదలెట్టారు. చుట్టుపక్కల గ్రామాల నుంచీ రైతులు తండోపతండాలుగా తరలొచ్చి, వారి వారి ఫిర్యాదులు నమోదు చేయించుకోడానికి ఉత్సాహం చూపారు. తమ బాధల్ని అలా మరొకరికి తెలియజేయడం ద్వారా సాంత్వన లభిస్తుందని ఆ రైతులు భావించారు. లాయర్లు ఆ వివరాలన్నింటినీ నమోదు చేయడంలో రోజంతా తలమునకలయ్యేవారు. ప్రతీ రైతూ తాము చెప్పే విషయాలన్నీ అక్షరసత్యాలనీ, ఏకరువు పెట్టి వివరించిన బాధల్లో ఒక్కటి కూడా అతిశయోక్తి లేదని పదే పదే నమ్మగర్భంగా పలికేవారు.

మా కాలేజీకి వేసవి సెలవలు ఇచ్చిన వెంటనే, వో పదిహేను రోజుల తర్వాత నేనూ గాంధీజీతో చేరాలనుకున్నా. ఐతే, ఈసారి వేసవి సెలవలు అస్పష్ట సమాచారంతో ఇవ్వబడినాయి. అధికారులు నాకేదయినా అప్పగించాలనే నిర్ణయానికి అప్పటికే వచ్చున్నారు. ఆ సమయంలో నా సేవలు చంపారన్‌లో అవసరమని తలిచి గాంధీజీకి ఉత్తరం రాసాను. దానికాయన తిరిగి జవాబు లేఖ రాస్తూ;

మోతిహరి
ఏప్రిల్ 17, 1917

ప్రియమైన స్నేహితుడా,

నీ కళ్ళలోనూ, భావాల్లోనూ, పద్ధతుల్లోనూ ఇమిడున్న ప్రేమను నేను గ్రహించాను. నువ్వు నీ అవిభాజ్యమయిన అభిమానంతో సాయం చేయాలనుకుంటు న్నావని నాకు తెల్సు. అయితే, అది నీ యిష్టం. ప్రయోగాత్మక విద్యావిధానం కొరకు అహ్మదాబాదు వెళ్ళి నువ్వక్కడయినా పని చేయొచ్చు. అలాగే జైలుకెళ్ళడానికి సిద్ధపడి, తెగించి పనిలో పాలు పంచుకునేందుకు ఇక్కడికయినా రావచ్చును. ఐతే, ఇదంతా నేను ఖైదు చేయబడితేనే. ఒకవేళ, నీ కోసం నన్నే కనుక నిర్ణయించమంటే, ఇక్కడి రైతులు మనుషుల్లా గాలి పీల్చుకోగలిగి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని పొందేంత వరకూ నువ్విక్కడి నుంచి కదలకుండా ఉండాలంటాన్నేను. నా మట్టుకు నాకు ప్రస్తుతం

చంపారనే నివాసస్థలం. రోజురోజుకీ ప్రపంచంలో మరెక్కడికన్నా ఇక్కడి పరిస్థితి ఘోరమనే భావం వీరి కన్నీటిగాథలు విన్నకొద్దీ నాలో మరింత బలపడుతోంది.

నీ
ఎమ్.కె. గాంధీ

ఆ జవాబుతో నేను బయలుదేరి మోతిహారి చేరాను. స్థానిక మాండలీకంలోనే మాట్లాడగలిగి అక్కడి రైతుల బాధల్ని అక్షరబద్ధం చేసి వారి ఫిర్యాదుల్ని నమోదు చేయడం నా వల్ల కాకపోయినా నేను మరోరకంగా వారికి ఉపయోగపడ్డాను.

అక్కడి జీవితం గురించి ఆసక్తికర విషయాలు కొన్నున్నాయి. అక్కడికొచ్చిన ప్రతీ ఒక్క న్యాయవాదీ నాటి బీహారీ సంప్రదాయాన్ననుసరించి తమతో పాటు ఒక సేవకుడ్ని వెంట తెచ్చుకున్నారు. మధ్యతరగతి వారు సేవకుడు లేకుండా ఎక్కడికీ వెళ్ళేవాళ్ళే కారు. బిహారీ మిత్రులు సాయంత్రం 8 గంటలప్పుడు కొద్దిపాటి ఫలహారం తీసుకుని రాత్రి 11 గంటలకు భోజనం చేసేవారు. త్వరలోనే గాంధీజీ ప్రోత్సాహంతో సేవకుల్ని పంపించి వేసి సమిష్టి వంటశాలకు అలవాటుపడ్డారు. 8 గంటలకే భోజనం ముగించేవారు. గాంధీజీ అహ్మదాబాద్ ఆశ్రమం నుండీ కస్తూర్బానీ, మహదేవ్ భాయిని పిలిచారు. ఆమె వచ్చాక వంటశాల నిర్వాహకురాలిగా ఆముంటే, మాలో కొద్దిమంది ఆవిడకి సహాయకులుగా ఉండేవాళ్ళం. నాకక్కడ చాలా కొద్దిపని మాత్రమే ఉండేది. ఐతే, ఏ పనీ లేకుండా కేవలం గాంధీజీ దర్శనార్థం తరలివచ్చే అసంఖ్యాక రైతుల్ని క్రమబద్ధీకరించి ఆయనను కాపాడుకోవాల్సొచ్చేది. మామూలుగా నైతే, నేను అప్పుడప్పుడు నాకూ, గాంధీజీకి కలిపి వండుతుండేవాడ్ని. ముజఫర్‌నగర్‌లో నా వంటకోసం తీసుకున్న కుక్కర్‌ను నాతోబాటు తీసుకొచ్చుకున్నాను. ఐతే, గాంధీజీ ఆ సమయంలో తిరిగి ఆయన ఆహారాన్ని మార్పు చేసుకున్నారు. ఆయన అన్నం, ఉడకబెట్టిన కాయగూరలతోపాటు స్థానికంగా అందుబాటులోనుండే ఏదోక ఫలాన్ని తీసుకునేవారు. ఉప్పునీ, మసాలాల్ని వాడేవారు కాదు. రుచీపచీ లేని చప్పిడి తిండంటే నాకు వ్యతిరేకతేమీ లేదుగానీ కొద్దిగా ఉప్పు మాత్రం కలుపుకుని తినేవాడ్ని. ఆ రోజుల్లో గాంధీజీ తిండి ఖరీదు రోజుకి రెండణాలు. బియ్యమూ, కూరగాయలూ చంపారన్‌లో చవకే. అప్పటికింకా పాలు తీసుకోవడం ఆయన ప్రారంభించలేదు. దక్షిణాఫ్రికాలో భిన్న రుచులకి అలవాటుపడిన గాంధీజీకి భారతీయ పండ్ల రుచి బాగున్నట్లుగా నాకనిపించింది.

# 7. చంపారన్ సత్యాగ్రహ శత సంవత్సర సంరంభం

**- జయా వింధ్యాల**

పుస్తక సమీక్ష....100 సంవత్సరాల కిందట రైతుల స్థితిగతులు ఎలా ఉన్నాయో .. నేడు ఎలా ఉన్నాయో , వారి జీవితాలలో ఏమైనా మార్పు ఉందొ లేదో ... స్వపాలకులు రైతుల పక్షపాతులం అని చెప్పే మాటలు ఎంత నిజమో ! మనం, “చారిత్రక మహెూద్యమం చంపారన్ సత్యాగ్రహం –(100 సంవత్సరాల చంపారన్ ఉద్యమ విశ్లేషణా వ్యాసాలు)”– చదివితే ఇట్టే తెలిసిపోతుంది. రైతు ఉద్యమాలను ఎలా నిర్మించవచ్చో కూడా చంపారన్ ఉద్యమ విశ్లేషణా వ్యాసాలు ఓ స్ఫూర్తిగా పనికి వస్తాయి అని నేను గట్టిగా చెప్పగలను. ఈ వ్యాసాలకు మూలం తుషార్ గాంధీ, ఇర్ఫాన్‌హబీబ్ మరియు ఆచార్య జె. బి. కృపాలనీలు. స్వేచ్ఛానువాదం గౌరవ్. వీటిని సంకలనం రూపంలో తీసుకొచ్చి రైతు ఉద్యమాలలో పనిచేస్తున్న ఉద్యమకారులకు అందించేటందుకు పి. జనార్దన్ రెడ్డి (మాజీ శాసన సభ్యులు) మరియు రావెల సోమయ్యలు కృషి చేసారు.

సంకలన కర్తల “మా మాట” ను చదివుతే మహాత్మాగాంధీని వ్యతిరేకించే వారిలో పునరాలోచన కలగకమానదు. సంకలన కర్తల మాటలలో “దిక్కులేని అన్నదాతలు వారి గోడు వినేనాథుడే కనబడక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. యాంత్రికమైన స్తబ్దతనే నాగరికతగా భ్రమిస్తోన్న నేటి యువతరానికి మానవీయ స్పృహతో కూడిన ఒక నిరసన అవసరమని తెలపడమే మా ఉద్దేశం” .. ఈ పదాలు చదివితే ఒక్కసారి హృదయం ఆగిపోయి మళ్ళీ కొట్టుకునే పరిస్థితి పాఠకులకు కలుగుతుంది. నెత్తి పై ఓ మొట్టికాయ వేసి బాధ్యతను గుర్తుచేస్తున్నట్లు పాఠకులకు అనిపిస్తుంది. సంకలనకర్తల మనసులలో ఎంత ఆవేదన ఉందో పై వాక్యాలు చెపుతాయి. పి. జనార్దన్ రెడ్డి (మాజీ శాసన సభ్యులు) వయసు 80, రావెల సోమయ్య వయసు 75, అయినప్పటికీ ఎంతో విలువైన వ్యాసాలను సంకలనం రూపంలో తీసుక వచ్చుటకు వారి వయసు అడ్డుచెప్పలేదు. కానీ తపన వారిలో కనిపిస్తుంది.

ముందు మాట రాసిన డా. ఎ.బి.కె. ప్రసాద్ .. రైతు సత్యాగ్రహ పోరాటాల శత సంవత్సర సంరంభం అన్నారు. నీలి మందు రైతుల దుస్థితికి వ్యతిరేకంగా గాంధీ సత్యాగ్రహ ఉద్యమం బీహార్ సరిహద్దులు దాటి యావత్ భారతాన్ని కదిలించిన విషయం చాలా స్పష్టంగా రాసారు. ముందు మాటలో మనకు నేటి రాజకీయ

పరిస్థితులను డా. ఎ. బి. కె. ప్రసాద్ చెప్పకనే చెపుతారు. నాడు 4 లక్షల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. పరాయి పాలకుల దోపిడీ వల్ల రైతాంగం కునారిల్లి పోగా ... నేడు అవే ప్రజా వ్యతిరేక వలస పాలన చట్టాలు కొనసాగడం వల్ల రైతులు, వ్యవసాయ కార్మికులు, వృత్తి పనివార్ల అగచాట్లు పెరిగిపోతున్నాయి అని పాలకులకు ఒక హెచ్చరిక చేసారు. ఇంకో అడుగు ముందుకు వేసి "విభిన్న జాతులు, మతాలు, సంప్రదాయాలు, భిన్న సంస్కృతులతో కూడివున్న భారతదేశాన్ని లౌకిక స్ఫూర్తితో సదా నిలపడానికి గాంధి చేసిన సత్యాగ్రహ ప్రయోగం భిన్న రాజకీయ పక్షాలు, విభిన్న పార్టీల నాయకులకు అంతే విభిన్న కోణాల నుంచి భిన్నంగా తోచవచ్చు" అని కుండబద్దలు కొట్టి చెప్పారు. "ముందు మాట" వ్యాసాలు చదువరులకు ఓ దారి చూపుతుంది.

ఇందులో మొత్తం 6 వ్యాసాలు. ఒక్కోవ్యాసం, నేటి ఉద్యమకారులకు గాంధేయ మార్గంలో ప్రజలను ఎలా ఉద్యమాలలోకి తీసుకురావచ్చో ఓ క్లారిటీ ఇస్తాయి. ప్రభుత్వాలు ప్రజల పట్ల తమ బాధ్యతలను మరచి పోతే ఎలా గుర్తు చేయవచ్చో ఈ వ్యాసాలు ఉద్యమకారులకు ఒక మార్గం అవుతాయి. గాంధీ, ఆర్.ఎస్.ఎస్.కి హిందూ ద్రోహి గాను, ముస్లీమ్ లీగ్‌కు ముస్లీమ్ ద్రోహిగాను, కమ్యూనిస్టులకు బూర్జువాగాను, అంబేద్కరిస్టుల దృష్టిలో బనియాగాను, కాంగ్రెస్‌కు కడుపు మంటగాను, సోషలిస్టులకు స్వోత్కర్ష గాను భావిస్తారని "అణచివేతపై అన్నదాతల చెర్నాకోల చంపారన్ సత్యాగ్రహం అని "గౌరవ్ రాసిన వ్యాసంలో, ఎవరి మొఖాల పై వారే ఎలా రాసుకున్నారో కదా ! అని పాఠకులకు ఆ వ్యాసం చదివితే అనిపిస్తుంది. అప్పుడూ స్త్రీల విద్యకోసం ప్రచారం చేసారు. 100 సంవత్సరాల తరువాత కూడా స్త్రీల విద్యపై ప్రచారం చేయవలసిన పరిస్థితే !

ఇదే వ్యాసంలో గౌరవ్, చంపారన్ సత్యాగ్రహం గురించి .. ఇది ఒక నూతన తరహా ఉద్యమ రూపానికి ఆరంభ స్వరూపం. ప్రపంచ దేశాలలో హింసాత్మక రూపాల్లో వెల్లువెత్తుతున్న తిరుగుబాట్లకు విరుద్ధంగా అద్వితీయ రీతిలో ఆధునిక భారతదేశంలో మొట్టమొదటిసారి రైతు ఉద్యమాన్ని నిర్మాణాత్మకంగా సుస్థిరరూపంలో ఎలా కొనసాగించి, ఎలా విజయం సాధించారో మనకు ఈ వ్యాసాలలో కనిపిస్తుంది. పరిశ్రమల పేరుతో పంట భూములను నాశనం చేసుకుంటూ, అభివృద్ధి అనుకుంటూ వినాశనాన్ని కొని తెచ్చుకుంటున్న విషయాన్ని గాంధీ ఎలా గుర్తించాడో, పరిష్కార ప్రయత్నాలు ఎలా చేసాడో మనకు ఈ వ్యాసాలలో తెలుస్తుంది. ఇప్పుడు మనం నర్మదా బచావో, జల్ జంగల్ జమీన్ నినాదాలు అదే కోవకు చెందినవే. ఈ వ్యాసాన్ని పాఠకులు చదువుతూ పోతే "మర్క్స్, ఏంగిల్స్, లెనిన్, స్టాలిన్, మావో,

అంబేడ్కర్ , రాయ్ , లోహియా , పెరియార్, పూలె, అందరూ జీవితాంతం మారుతూనే వచ్చారు, వారి మానసిక పరిణామం ప్రగతిశీలమయితే .. ఒక్క గాంధీ పరిణామం మాత్రం తిరోగమనం ఎందుకయ్యింది? అని వ్యాసకర్త ప్రశ్నిస్తాడు. ఆ ప్రశ్నలో చిరు కోపం, ఓ లాంటి ధిక్కార స్వరం పాఠకులు గమనించక పోరు. ఈ వ్యాసకర్త ఇంకా ఒకడుగు ముందుకు వేసి లౌకిక వాదులుగా వుండి కూడి మతస్థులైన నాయకుల్ని అంతా మనకోసమే చేసారని సమర్థించుకుంటాము, కానీ సామాన్య మతస్తుడిగా మొదలై గాంధీ లౌకికవాదిగా మారిన పరిణామాన్ని ఎందుకు అర్థం చేసుకోవడంలో విఫలమౌతున్నాం అంటూ ... ఫాసిజాన్ని సమర్థించినా తప్పులేదు కానీ గాంధీని క్షమించడం అంత నేరం మరోటి లేదనే వాతావరణాన్ని ప్రగతిశీల వాదులు సృష్టించారు.. అని తల ఎగిరేసి చెపుతున్నట్లు పాఠకుల మనసుకు హత్తుకుంటుంది. గౌరవ్ హృదయం నుండి, చెమ్మగిల్లిన కనులతో రాసాడా ఇది అనేంతగా .. ఈ పదాలు వ్యాసానికి చివరిలో అంటాడు .. "దేశంలో అన్ని ప్రాంతాల అన్నదాతలు అసహాయంగా ఆత్మహత్యలకి పాల్పడుతూ, దినకూలీలుగా, వాచ్‌మెన్‌లుగా వలసపోతూ మానసికంగా శవాలైపోయి, ముద్దపెట్టి ఆదరించిన వ్యవస్థ చేతనే దిక్కుమాలిన వాళ్ళుగా చూడబడుతూ, వ్యవసాయం అంటేనే పనికిమాలిన పనిగా చూస్తున్న ప్రస్తుత పరిస్థితులలో, దేశ చరిత్రలో తొలిసారిగా తమ వీపులపై స్వారీ చేస్తూ తమ చెమటని రక్తాన్ని జుర్రుకుంటూ వికటాట్టహాసం చేస్తున్న దోపిడీదారులకు ఎదురు నిల్చి వారి దురాగతాలకు చరమ గీతం పాడేలా చెర్నాకోల విదిలించిన రైతు విప్లవ శంఖారావమైన చంపారన్ సత్యాగ్రహం .. ఈ తరంలో కొద్దిమందైనా గ్రహించి వాదవివాదాలకతీతంగా నా దేశపు రైతుపక్షాన ప్రశ్నించి నిలవడానికి నిర్ణయించుకుంటే .. ఈ వ్యాసాల సంకలనాల ప్రయత్నానికి ప్రయోజనం".

రెండవ వ్యాసం తుషార్ గాంధీ రాసిన "చంపారన్ సత్యాగ్రహం 100 సంవత్సరాల రైతుల యధాతథస్థితి"లో నీలిమందు రైతుల స్థితి 100 సంవత్సరాల క్రితం ఎలా ఉండేదో .. ఈనాడు రైతులందరి పరిస్థితి ఆధునిక భారతదేశంలో కూడా అలానే ఉంది అనే దానిని కళ్ళకు కట్టి చూపించింది. ఇంకో వ్యాసం ఇర్ఫాన్ హబీబ్ రాసిన "చారిత్రక మహోద్యమం - చంపారన్ సత్యాగ్రహం" లో ఆనాడు నీలిమందు తోటలను పండించే రైతుల దీనగాథ ఎలాంటిదో మనం ఇందులో చూడవచ్చు. ప్రభుత్వం రైతుల పంటలకు ధరలను ఎలా నిర్ణయిస్తుందో ఉదాహరణలతో సహా పాఠకులకు సులభంగా అర్థమయ్యేటట్లు రచయిత రాసారు. ఇక్కడ మనం

అంటే పాఠకులు గమనించాల్సింది వ్యాసకర్త ఇర్ఫాన్ హబీబ్ మార్క్సిస్టు మరియు గాంధీని వ్యతిరేకించే వారిలో ఒకరు, అయినప్పటికిని చంపారన్ రైతుల హక్కులను కాపాడటంకోసం గాంధీ చేసిన సత్యాగ్రహం గురించి రాసిన ఒక్కోపదాన్ని చదువుతూ పోతే ... నిజమేనా .. గాంధీ వ్యతిరేకుల్లో హబీబ్ ఒకరా? అనే అనుమానం పాఠకులకు వస్తుంది. ఆనాడు వ్యవసాయ చట్టం తీసుకువచ్చేటట్లు ప్రభుత్వం పై గాంధీ ఎలా ఒత్తిడి పెట్టాడో పాఠకుల కళ్ళముందు వ్యాసకర్త సజీవంగా చూపించాడు. మరో వ్యాసం "మొట్టమొదటి సత్యాగ్రహం" ఆచార్య జె.బి.కృపాలనీ రాసిన దానిలో గాంధీని నేపాల్ దేశం సరిహద్దులకు దగ్గరగా బీహార్ రాష్ట్రము లో వున్నా చంపారన్ జిల్లాకు ఎలా తీసుకు వెళ్లారో, గాంధీ ప్రభుత్వ నిర్భంధాన్ని ఎలా ఎదుర్కొన్నాడో, రైతుల మనసులలో స్థానాన్ని గాంధీ ఎలా సంపాదించుకున్నాడో అనేది ఇప్పుడు జరుగుతున్నదా అనే భ్రమ పాఠకులకు కలుగుతుంది. ఈ వ్యాసాలలో మహాత్మాగాంధీ రాసిన "నీలిమందు మచ్చ" చూడవచ్చు. గాంధీ చంపారన్‌కు వెళ్ళేటందుకు కారకుడైన రైతు రాజకుమార్ శుక్లా, శుక్లా గురించి గాంధీ ఎంతగా ఎలా ఆలోచించాడో వివరంగా పాఠకులకు ఈ వ్యాసంలో కనిపిస్తుంది. నేటికీ అలాంటి రైతులే ఉద్యమకారులకు కనిపిస్తారు. ఇందులో అనుమానమే లేదు. పేజీ 43 నుండి 61 వ పేజీ వరకు గాంధీ మాటలలో చంపారన్ రైతు ఉద్యమాన్ని, స్కూళ్ల ఏర్పాటు, వైద్యం – ఆరోగ్యం, ఆడవాళ్ళ పరిస్థితి, సమస్యలు వినవచ్చు. ఇప్పటికీ మహిళల పరిస్థితి అలానే ఉంది అని నేను చెప్పటం ఏమి అతిశయోక్తి కాదు అంటాను. చివరిది, "చంపారన్‌ను స్మరించుకోవడం గాంధీని స్మరించుకోవడమే" అని సుధీర్ చంద్ర రాసారు. వ్యాసాలు చదవటం అయిపోతున్న క్రమంలో, స్మరించుకోవడం ఒక్కటే కాదు, గాంధీ పై ఉన్న వ్యతిరేక అభిప్రాయాలూ, చర్చించుకునే అంశాలుగా మారతాయని నేననుకుంటాను.

ఈ పుస్తక ముఖచిత్రం చూపరులను ఆకర్షించేటట్లుంది. ముఖచిత్రం లోపల, చివర పెట్టిన కొటేషన్స్ గాంధీ అంటే ఏమిటో తెలియచేస్తాయి. ఈ వ్యాసాలు నేడు, ముందుతరాల ఉద్యమాల నిర్మాణంలో కూడా మార్గం చూపిస్తాయి అని చెప్పేటందుకు నాకెలాంటి సందేహం లేదు. ఈ పుస్తకం తేది: 14-08-2017 న తెలంగాణ రాష్ట్రం హోమ్ మినిష్టర్ నాయిని నరసింహారెడ్డి గారి చేతుల మీదుగా మార్కెట్‌లోకి వచ్చింది. అందరూ చదవవలసిన వ్యాసాల పుస్తకం.

*– అంతర్జాలం నుండి*



# 8. 'చంపారన్'తోనే గాంధీ ప్రస్థానం

**- రామచంద్ర గుహ**

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ ఉత్తర బీహార్‌లోని చంపారన్ జిల్లాలో వందేళ్లక్రితం అడుగుపెట్టారు. యూరోపియన్ ప్లాంటర్ల (తోటల పెంపకందారులు) ఒత్తిడివల్ల తమ ఇష్టానికి భిన్నంగా నీలి (Indigo) పంటలు సాగుచేస్తున్న రైతాంగ సమస్యల్ని అధ్యయనం చేస్తూ ఆయన ఆ జిల్లాలో అనేక మాసాలు గడిపారు. ఈ నిర్బంధాన్ని ధిక్కరించిన రైతు పొలాల్ని ప్లాంటర్లు జప్తు చేసేవారు. బ్రిటీష్ వలస రాజ్యంతో గాంధీ మధ్యవర్తిత్వం నెరపి నీలి పంట రైతాంగానికి గణనీయమైన రాయితీలను సాధించగలిగారు. కౌలు రేట్లు బాగా తగ్గిపోయాయి. నిర్బంధపు నీలిసాగు స్థానంలో స్వచ్ఛందంగా సాగు చేసే పద్ధతి అమల్లోకొచ్చింది. ఇది రైతులు సాధించిన ప్రధానవిజయం. అదే సమయంలో గాంధీ స్వయంగా సాధించిన ఘన విజయం కూడా. దక్షిణాఫ్రికా అనుభవానికి భిన్నంగా భారత్‌లో తానొక నాయకుడిగా అవతరించేందుకు అవసరమైన విశ్వసనీయత ఆ విజయం ద్వారా గాంధీకి లభించింది.

చంపారన్ పోరాట వాస్తవాలను మళ్ళీ చెప్పడం కాకుండా ఆ ప్రాంతంలో సుదీర్ఘకాలం పాటు నిర్వహించిన కార్యకలాపంలో గాంధీలో ప్రస్ఫుటమైన ఆరు విశిష్ట లక్షణాలనూ, అవి ఆయన భవిష్యత్ కార్యాచరణకు ఎలా ఉపకరించాయో వివరించేందుకు ప్రయత్నిస్తాను. చంపారన్ అనుభవం ద్వారా గాంధీ భారత రైతాంగ సమస్యల్ని ప్రత్యక్షంగా అర్థం చేసుకోగలిగారు. పోర్‌బందర్, రాజ్‌కోట్ పట్టణాలలో గాంధీ పుట్టిపెరిగారు. బారిస్టర్ చదువు పూర్తి చేసిన తర్వాత బొంబాయి మహానగరంలో లాయర్‌గా జీవితం ప్రారంభించారు. ఆ తర్వాత ఆయన రెండు దశాబ్దాలు దక్షిణాఫ్రికాలో గడిపారు. 1915లో గాంధీ భారత్‌కు తిరిగి వచ్చినాక దేశవ్యాప్తంగా విస్తృతంగా పర్యటించారు. చంపారన్‌కు రాక మునుపు, ఆయన ప్రధానంగా పట్టణవాసులతోనే సంప్రదింపులు జరిపారు.

చంపారన్‌లో ఉదయం నుంచి సాయంత్రం వరకు ప్రవాహంలా వస్తున్న సందర్శకులతో గాంధీ సంప్రదింపులు జరుపుతూ మోతిహరి, బెత్తియ రెండు ప్రధానపట్టణాలలోనే ప్రధానంగా గడిపారు. స్వయంగా ఆయన కొన్ని గ్రామాలలోకి వెళ్ళి అధ్యయనం చేశారు. ఆయన పలువురు రైతుల్ని కలుసుకున్నారు. అదే సమయంలో

యూరోపియన్ ప్లాంటర్లను, ఫ్యాక్టరీ మేనేజర్లను సైతం ఆయన సంప్రదించారు. ప్రతిచోటా, ఆయన్ని రహస్య పోలీసులు వెంబడించేవారు. సమావేశాలలో ఆయన మాట్లాడిన ప్రతి అంశాన్ని వారు నమోదు చేసేవారు.

యథావిధిగా గాంధీ తీరిక లేకుండా పనిచేసేవారు. మే చివరినాటికి, చంపారన్ జిల్లాలో పర్యటించిన ఆరు వారాల కాలంలో ఏడు వేలు దాకా ప్రత్యక్ష దృష్టాంతాలను ఆయన సేకరించారు. ప్రతి దృష్టాంతమూ చంపారన్ రైతులు ఎలా బతుకుతున్నారు, ఎలా కష్టపడుతున్నారనే విషయాలపట్ల గాంధీ అవగాహనను పెంచేందుకు దోహదం చేశాయి.

చంపారన్ అనుభవంతోనే భారతీయ రైతు జీవితం గురించి సరైన పరిజ్ఞానం గాంధీకి మొట్టమొదటిసారి లభించింది. రెండవ విషయమేమంటే, రాబోయే రోజుల్లో స్వాతంత్ర్యోద్యమంలో తనకు సహకరించే సహచరుల యంత్రాంగాన్ని ఏర్పాటు చేసుకునే ప్రయత్నాలు చంపారన్‌లోనే గాంధీ ప్రారంభించారు. చంపారన్‌కు వచ్చిన వారంరోజుల తర్వాత తన పాత సహచరుడు హెన్రీ పోలక్‌కు గాంధీ ఒక లేఖ రాస్తూ, 'దక్షిణాఫ్రికాలో గడిపిన మంచిరోజులన్నిటినీ గుర్తు చేసుకుంటున్నాను. ప్రజలు అన్నివిధాల సహకరిస్తున్నారు. నాయిడులను, సోరాబ్జీలను, ఇమామ్‌లను మనం త్వరలో ఇక్కడ కనుగొనగలం. కచాలియా విషయంలో పొరపాటు పడవచ్చునేమో నాకు తెలియదు' (వీరందరూ దక్షిణాఫ్రికాలో గాంధీకి సన్నిహితులు).

చంపారన్‌లో, సింధ్ ప్రాంతవాసి వికృతంగా సన్నని, పొడవైన విద్వాంసుడు జేబీ కృపలానీతో గాంధీ తన పరిచయాన్ని పునరుద్ధరించుకున్నారు. 1915లో శాంతినికేతన్‌లో వారిద్దరికీ మొట్టమొదటగా పరిచయం ఏర్పడింది. కృపలానీ 11917 ఏప్రిల్‌లో, స్థానిక ప్రభుత్వ కాలేజీలో అధ్యాపకుడుగా పని చేసేవారు. ముజఫర్‌పూర్ రైల్వేస్టేషన్‌లో దిగిన గాంధీని కృపలానీ కలిసారు. గాంధీని బగ్గీలో ఎక్కించుకుని స్టేషన్ నుంచి ఇంటిదాకా కృపలానీ ఔత్సాహిక విద్యార్థులు బగ్గీని నెట్టుకు వచ్చారు.

చంపారన్‌లో ఉన్నంతకాలం గాంధీకి చేదోడువాదోడుగా కృపలానీ నిలిచారు. అదేవిధంగా కొంతమంది పాట్నా న్యాయవాదుల సమూహం కూడా గాంధీకి సహకరించింది. చంపారన్‌లో సుదీర్ఘకాలంగా ఆసక్తి కలిగిన బ్రిజ్‌కిషోర్ ప్రసాద్ సహా కలకత్తాలో విద్యావంతుడైన విద్వాంసుడు, కోర్టులో వర్ధమాన తారగా ఎదుగుతున్న

రాజేంద్రప్రసాద్‌లు వారిలో ఉన్నారు. వీరందరూ ఆతర్వాత అనేక ఏళ్ళపాటు గాంధీకి అనుయాయులుగా కొనసాగారు.

మూడవది, చంపారన్‌లో విజయవంతంగా సాగిన కృషిఫలితంగానే తన సొంత రాష్ట్రానికి చాలా దూరంగా ఉన్న ప్రాంతంలో మొట్టమొదటిసారి ప్రజల విశ్వాసాన్ని గాంధీ సంపాదించగలిగారు. చంపారన్‌లో గాంధీతోపాటు పనిచేసిన న్యాయవాదులు వినయ సంపన్నులుగా కనిపిస్తారు. 'ఇక్కడ నేను చేస్తున్న పని నాకు రోజురోజుకూ ఉత్సాహాన్నిస్తోంది. నా చుట్టూ కూర్చున్న పేద రైతులు నన్ను శ్లాఘిస్తున్నారు. సరైన కార్యక్రమ రూపకల్పనకు వారంతా నన్ను విశ్వసించగలరనిపిస్తోంది. వీరి ప్రేమకు నేను పాత్రుడిని కావాలని మాత్రమే నేను ఆశించగలను' అని గాంధీ ఒక డేనిష్ స్నేహితునికి లేఖ రాశారు.

నాల్గవది, చంపారన్‌లో గాంధీ కార్యాచరణతో ఆయనపై విశ్వసనీయత గుజరాత్‌లో మరింతగా పెరిగేందుకు దోహదం చేసింది. '1917కు పూర్వం, గుజరాత్‌లో కరుడుకట్టిన సంప్రదాయవాద భావజాలంతో కూడిన జాతీయవాద వర్గాలకు ప్రసిద్ధి' అని డేవిడ్ హార్డిమన్ అనే చరిత్రకారుడు రాశారు. ఆనాడు గుజరాత్ సభ మితవాద న్యాయవాదులు, విధేయులు, యథాస్థితివాదాలతో నిండి ఉండేది. వారిలో కొందరు 'దారితప్పిన మతవాద విపరీత బుద్ధులు' అని గాంధీ అభిప్రాయపడేవారు. చంపారన్ జిల్లాలోకి ప్రవేశించిన వెంటనే, ఆ ప్రాంతం వదిలి వెళ్ళాలని బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశాలను ధిక్కరించడంతో, గాంధీ గుజరాత్ జాతీయవాద మేధావుల అభిప్రాయంలో మార్పు వచ్చింది. ప్రభుత్వ ఆదేశాలను గాంధీ సవాలు చేసారనే వార్త అహ్మదాబాద్ చేరడంతో 'గుజరాత్ క్లబ్‌లోని న్యాయవాద సమూహం ఒక్కసారి దిగివచ్చి', తమ సభకు ఈ 'ధైర్యశాలి'ని తర్వాతి అధ్యక్షుడుగా ఎంపిక చేయాలని నిర్ణయించుకుంది'.

లండన్‌లో బారిస్టర్ పట్టా పుచ్చుకొని వచ్చిన వల్లభ్‌భాయ్ పటేల్ 1917లో గుజరాత్ క్లబ్ సభ్యుల్లో ప్రముఖులు. వాస్తవంలో, చంపారన్‌లో గాంధీ సవాల్ చేసిన సందర్భంలో గుజరాత్ క్లబ్‌లో ఆయన ఒక వారధి పాత్ర పోషించారు. ఆ తర్వాత, గాంధీతో కలిసి పనిచేసేందుకు ఆయన తన లాభదాయకమైన న్యాయవాద వృత్తిని వదిలిపెట్టారు. మహాదేవ్ దేశాయ్, నరహరి పారిఖ్ అనే మరో ఇద్దరు గుజరాత్ న్యాయవాద వృత్తిని వదిలిపెట్టారు. మహాదేవ్ దేశాయ్, నరహరిపారిఖ్ అనే మరో

ఇద్దరు గుజరాత్ న్యాయవాదులు 1917లో గాంధీతో కలిసి పనిచేయడం మొదలుపెట్టారు. పటేల్ లాగా వారిద్దరూ మహాత్ముని జాతీయ, సామాజిక పునరుద్ధరణ కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోవడంలో పరిత్యాజ్యులుగా మారారు.

ఐదవ అంశం, చంపారన్ కార్యకలాపంలో గాంధీ మొట్టమొదటిసారి బ్రిటీష్ రాజ్ ఉన్నతాధికారులతో స్థిరమైన తీరులో బలంగా తలపడ్డారు. దక్షిణాఫ్రికాలో తెల్లజాతి అధికారులతో, రాజకీయనాయకులతో ఆయన తరచూ తీవ్రంగా ఘర్షణ పడ్డారు. అయితే అదే తీరులో ఆయన చంపారన్ రైతాంగంతోనే కాక జిల్లా మేజిస్ట్రేట్లు, కమీషనర్, బీహార్ లెఫ్టినెంట్ గవర్నర్‌లతో క్రమం తప్పకుండా సమావేశాల్లో పాల్గొనేవారు.

1917 జూన్ రెండవ వారంలో రైతాంగ దృష్టాంతాలను బ్రిటీష్ అధికారుల ముందు పెట్టి వారిని నిలదీశారు. దాంతో బీహార్ ప్రభుత్వం చంపారన్ వ్యవసాయ దర్యాప్తు కమిటీని ఏర్పాటు చేసింది. ఏడు మందితో ఏర్పడిన కమిటీలో నలుగురు ఐసీఎస్‌లు సహా గాంధీ కూడా ఉన్నారు. కేంద్ర ప్రావిన్సుల నుంచి వచ్చిన అధికారి ఆ కమిటీకి ఛైర్మన్‌గా ఉన్నారు. వలస రాజ్య స్వభావం గురించి 1917లో అంతంత మాత్రం అవగాహన కలిగిన గాంధీ, ఈ కమిటీ సమావేశాల ద్వారా మరింత లోతైన జ్ఞానాన్ని ఆర్జించారు. ఆయన భారతీయ సంస్థానంలో పుట్టి, అప్పటి వరకు జీవితంలో ఎక్కువ కాలం పరాయి దేశాల్లో గడిపారు.

చివరగా చంపారన్ కార్యకలాపం ద్వారా భారతీయ సమాజంలోని రైతులు, న్యాయవాదులు, వ్యాపారులు తదితర విస్తృతమైన జన సమూహాల మనసులను, హృదయాలను గెలుచుకోగలననే విశ్వాసం గాంధీకి కలిగింది. చంపారన్‌కు వచ్చిన గాంధీపట్ల అక్కడి రైతులు పెట్టుకున్న నమ్మకం గురించి నేను ఇదివరకే చెప్పాను. కొన్ని మాసాల అనంతరం, 1917 అక్టోబర్ 3న చంపారన్ వ్యవసాయ దర్యాప్తు కమిటీ తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. ఆ నివేదిక ప్రధానంగా రైతులకు అనుకూలంగా మాట్లాడింది. అక్కడి నుఇ౦చి ఒక వారంరోజులు గడిపేందుకు మోతిహరికి, రెండు రోజులు గడిపేందుకు బెత్తియకు, ఆ తర్వాత అహ్మదాబాద్‌కు తిరిగి వెళ్ళేందుకు గాంధీ ప్రయాణమయ్యారు. గాంధీ ప్రయాణిస్తున్న రైలు బెత్తియకు చేరుకోగానే, అక్కడ 4,000 మంది రైతులు ఆయనకు స్వాగతం పలికారు.

భారతదేశంలో గాంధీ మొట్టమొదటి పోరాటం బ్రహ్మాండంగా విజయవంతం కావడాన్ని బెత్తియ రైల్వే స్టేషన్‌లో గాంధీకి స్వాగతం పలుకుతున్న సందర్భంలో జరిగిన హడావుడి తెలియజేస్తుంది. చంపారన్ రైతులూ, అక్కడి మధ్యతరగతి వర్గమూ కృతజ్ఞతకు నోచుకుంటారు.

చంపారన్ రైతులకు గాంధీ రుణపడి వున్నారు. అంతకంటే ఎక్కువగా వారికి గాంధీ రుణపడి ఉన్నారు. చంపారన్ రైతాంగ సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్న సమయంలోనే గాంధీ దేశంలోని రైతుల జీవితాన్ని అర్థం చేసుకోవడం ప్రారంభించారు. ఆ సందర్భంలోనే భవిష్యత్ స్వాతంత్ర్య పోరాటంలో సహకరించే అనుయాయులను, తన సొంత కులం, మతం, వర్గానికి అతీతంగా తనకు సహకరించగలిగే నమ్మదగిన రాజకీయసహచరులను సంపాదించారు. 1917లో ఉత్తర బీహార్‌లోని చంపారన్‌లో వారాలు, నెలల తరబడి చేసిన కృషి గాంధీని భవిష్యత్తులో మరిన్ని సుదీర్ఘమైన, క్లిష్టతరమైన పోరాటాలకు సంసిద్ధం చేసింది. చంపారన్ అన్‌ది భారత్‌లో గాంధీ మొట్టమొదటి రాజకీయ అనుభవం మాత్రమే కాదు. గాంధీ రాజకీయ జీవిత ప్రస్థానానికి, అలాగే స్వాతంత్ర్య పోరాటానికి అది కచ్చితమైన పునాదిగా నిలుస్తుంది. సహాయ నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహం, శాసన ఉల్లంఘన, క్విట్ ఇండియా వంటి ఉద్యమాల ప్రస్థానానికి, విదేశీ పాలన నుంచి దేశ విముక్తికి చంపారన్ నిశ్చయాత్మకంగా ఒక కీలకమైన ముందడుగు.

– ఆంధ్రజ్యోతి ఏప్రిల్, 2017





# 9. మహాత్ముడూ చంపారన్ ఆంగ్లేయులూ

**- రామచంద్ర గుహ**

మహాత్మాగాంధీ 1917 వేసవిలో నీలిమందు రైతుల స్థితిగతులను అర్థం చేసుకోవడానికి చంపారన్ ప్రాంతంలో పర్యటించారు. ఆ పర్యటనలో ఆయన పొందిన అనుభవాలు, నేర్చుకున్న పాఠాల గురించి నెలరోజుల క్రితం ఇదే కాలమ్‌లో విశ్లేషించాను ('చంపారన్' తోనే గాంధీ ప్రస్థానం - ఏప్రిల్ 15). గాంధీజీ పర్యటనను వ్యతిరేకించిన వారి గురించి ప్రస్తుత కాలమ్‌లో వివరిస్తాను. చంపారన్‌లో మహాత్ముని సత్యాగ్రహ ఉద్యమం వల్ల అధికంగా నష్టపోయినవారు నీలిమందు తోటల యజమానులు. వీరందరూ న్యాయవాదులు, మతాచార్యులు, సైనికాధికారుల కుమారులు. సమాజంలో వీరికి గల గౌరవ ప్రతిపత్తులు ఐపీయస్ అధికారులకు లభించే వాటికంటే తక్కువ స్థాయివే. అయితే వీరి జీవన ప్రమాణాలు చాలా ఉన్నత స్థాయిలో ఉండేవి. ఇండిగో ప్లాంటేషన్ (నీలిమందు తోట) మేనేజర్‌కు నెలసరి వేతనంతో పాటు ఫ్యాక్టరీ లాభాలలో వాటా ఉండేది. ఆయిల్, ఫ్యూయల్ ఉచితం. ఆహార ధాన్యాలు, కూరగాయలు మొదలైనవి కూడా తరచు ఉచితంగానే లభించేవి. చంపారన్ గ్రామీణ సీమలు అనేకానేక వన్యప్రాణులకు నెలవులు. పతకాలకు పులులు, చిరుతలను వేటాడేవారు. విందుకు జింకలు, కౌజులు లభించేవి.

1917 వేసవిలో చంపారన్‌కు గాంధీజీ రాకతో ఇండిగో ప్లాంటర్లకు మంచిరోజులు ఇంకెంతకాలం ఉంటాయనే ప్రశ్న తలెత్తింది. ఎందుకంటే నీలిమందు నిర్బంధసాగును గాంధీజీ తీవ్రంగా వ్యతిరేకించారు. గాంధీ రాకతో చంపారన్‌లో అశాంతి, నేరాలు పెరిగిపోయాయని యూరోపియన్ డిఫెన్స్ అసోసియేషన్ స్థానిక శాఖ ఒక తీర్మానంలో పేర్కొంది. గాంధీ పర్యటనను కొనసాగనిస్తే చంపారన్‌లోని యూరోపియన్ల సంక్షేమానికి, జిల్లా ప్రజల సంక్షేమానికి తీవ్ర హాని జరుగుతుందని ఆ తీర్మానం ఆందోళన వ్యక్తం చేసింది. బెట్టియరాజ్ అనే ప్లాంటేషన్ మేనేజర్ గాంధీ పర్యటన పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తం చేశాడు. 'గాంధీ నిజాయితీ పరుడే కావచ్చు గానీ, దక్షిణాఫ్రికాలో లభించిన విజయాలతో ఆయన తనను తాను ఎక్కువగా ఊహించుకుంటున్నాడు. గాంధీని తేలిగ్గా అమర వీరుడిని చేయవచ్చు గానీ, అణిచివేయటం సాధ్యం కాదని' ఆ బ్రిటిష్ ప్లాంటర్ అభిప్రాయపడ్డాడు. గాంధీని

తొలి నుంచి ఒక స్థిర వైఖరితో వ్యతిరేకించిన చంపారన్ ప్లాంటర్ డబ్ల్యు ఎస్ ఇర్విన్. బ్రిటిష్ పాలకులకు అనుకూలంగా ఉండే వార్తా పత్రికలకు ఆయన వరుసగా రాసిన వ్యాసాలలో యూరోపియన్ ప్లాంటర్లు అడవిని అనేక కష్టనష్టాలతో సేద్య యోగ్య భూమిగా మార్చివేశారని వాదించాడు. గాంధీ వచ్చేవరకు చంపారన్ రైతులు పూర్తి సంతృప్తితో వున్నారని ఆయన పేర్కొన్నారు. గాంధీ ఉద్యమ లక్ష్యశుద్ధిని ఇర్విన్ ప్రశ్నించారు. ఆయన పద్ధతులు మరింత తక్కువ నాటకీయతతో వున్నట్టయితే ఉద్యమ లక్ష్యాలపై సందేహాలు ఏర్పడేవని ఆ బ్రిటిషర్ అభిప్రాయపడ్డాడు.

1917 ద్వితీయార్ధంలో గాంధీ సతీమణి కస్తూర్బా చంపారన్‌లో భర్త వద్దకు వచ్చారు. కస్తూర్బా రాక ఇర్విన్‌కు మరింత ఆగ్రహం తెప్పించింది. కతకత్తా దినపత్రిక స్టేట్స్‌మన్‌కు రాసిన ఒక లేఖలో బహిరంగ–కార్యకలాపాలలో పాల్గొనని కమీషనర్‌కు హామీ ఇచ్చిన గాంధీ గోవధ, హిందూ–ముస్లిం సంబంధాలపై వివాదాస్పద ప్రసంగాలు చేస్తున్నారని ఆరోపించాడు. ఇదిలా ఉండగా శ్రీమతి గాంధీ ఇటీవల ఒక పాఠశాలను ప్రారంభించే మిషతో ఒక బజార్‌ను ప్రారంభించారు. ఫ్యాక్టరీకి చెందిన రెండు ఇరుగు పొరుగు బజార్లను మూసివేయించడానికే ఆమె ఆ పని చేశారు. ప్రభుత్వానికి ఇచ్చిన హామీకి నిజాయితీగా కట్టుబడి వుండానికేనా గాంధీ ఇదంతా చేస్తుంది? అని ఇర్విన్ ప్రశ్నించాడు. గాంధీ వెన్వెంటనే స్టేట్స్‌మన్‌కు రాసిన ఒక లేఖలో ఈ ఆరోపణలకు సమాధానమిచ్చారు. హిందూ–ముస్లింల మధ్య ఉద్రిక్తతలను తొలగించి సమైక్యతను నెలకొల్పడానికే తన ప్రసంగాలను ఉద్దేశించానని గాంధీ పేర్కొన్నారు. ఆ తరువాత తన భార్యపై వచ్చిన ఆరోపణ గురించి ప్రస్తావిస్తూ, అమాయకురాలైన తన భార్యకు ఈ ఆరోపణ గురించి తెలియనే తెలియదని గాంధీ అన్నారు. ఇర్విన్‌ను, తన భార్య కస్తూర్బాకు పరిచయం చేస్తానని, అతనికి తన భార్య చాలా సాధారణ మహిళ అని, దాదాపు నిరక్షరాస్యురాలని, తాను ప్రస్తావించిన రెండు బజార్ల గురించి ఆమెకు తెలియనే తెలియదనే వాస్తవం అతనికి తెలిసివస్తుందని గాంధీ పేర్కొన్నారు. ఉపన్యాసాలు చేయడం లేదా పత్రికలకు లేఖలు రాసే కళను శ్రీమతి గాంధీ ఇంకా నేర్చుకోలేదని ఎత్తిపొడుస్తూ గాంధీ తన లేఖను ముగించారు.

చంపారన్‌లోని నీలిమందు తోటల యజమానులు గాంధీ పట్ట బద్ధ వ్యతిరేకతతో వ్యవహరించినప్పటికీ ప్రభుత్వాధికారులు మాత్రం గుజరాత్ నుంచి వచ్చిన ఈ సందర్శకుడిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. గాంధీ చంపారన్ వచ్చిన

పక్షం రోజుల అనంతరం సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ ఒకరు ఇలా వ్యాఖ్యానించారు. 'నీలిమందు తోటల యజమానులు సహజంగానే గాంధీని తమ సహజ శత్రువుగా పరిగణిస్తున్నారు. యూరోపియన్లు తమ తమ నిర్దిష్ట అభిప్రాయాల ప్రకారం గాంధీని ఒక ఆదర్శవాది, ఒక మత మూఢుడు లేదా ఒక విప్లవవాదిగా చూస్తున్నా రైతులు మాత్రం ఆయన్ని తమ విమోచకుడుగా గౌరవిస్తున్నారు. గాంధీకి అసాధారణ శక్తులున్నాయని వారు విశ్వసిస్తున్నారు. గాంధీ గ్రామాల్లో పర్యటిస్తున్నాడు. తమ ఇక్కట్లు ఏమిటో వివరించాలని గ్రామీణులను ఆయన కోరుతున్నాడు. రామరాజ్యం రాబోతుందనే దార్శనికతతో నిత్యం వారి ఆలోచనలను ఆయన ప్రభావితం చేస్తున్నాడు'.

గాంధీని నిష్పాక్షికంగా అర్థం చేసుకున్న ఆంగ్లేయుడు 1917 వేసవిలో చంపారన్ సత్యాగ్రహోద్యమంలో జిల్లా మేజిస్ట్రేట్‌గా వున్న అధికారి. గాంధీ, చంపారన్‌లో వున్న కాలంలో ఈ ప్రభుత్వాధికారి అంతకంతకూ ఆయనపట్ల ఆకర్షితుడయ్యాడు. గాంధీ మాటల్లో విశేష శ్రద్ధాసక్తులు చూపించాడు. ఆయన గాంధీతో సంభాషించాడు. గాంధీ గురించి ఇతరులతో మాట్లాడాడు. అంతేకాదు అప్పటికి గాంధీ రాసిన వివిధ పుస్తకాలు, కరపత్రాలు మొదలైన వాటిని తెప్పించుకొని చదివాడు. తన ప్రతిస్పర్థి గురించి ఆ ఆంగ్లేయుడు ఇలా రాశాడు: 'ప్రాచ్య, పాశ్చాత్య భావ స్రవంతుల అపురూప మిశ్రమంగా గాంధీ కన్పిస్తున్నాడు. జాన్ రస్కిన్, టాల్‌స్టాయ్ రచనలు, బోధనలచే ఆయన ప్రభావితమయ్యాడు. ముఖ్యంగా టాల్‌స్టాయ్ ప్రభావం మరీ ఎక్కువ. వాటికి ఒక యోగి తపస్వితను గాంధీ జతచేశాడు. గాంధీ భావాలు కేవలం ప్రాచ్య ప్రపంచానికి చెందినవే అయితే ఆయన వాటిని తన వ్యక్తిగత జీవితానికి వర్తింపచేయడంతో సంతృప్తి పడేవాడు. పాశ్చాత్య భావాల ప్రభావం మాత్రమే ఆయన్ని ఒక క్రియాశీల సాంఘిక సంస్కర్తగా రూపొందించింది'. వ్యక్తిగా గాంధీ, ఆయన ఉద్యమం, ఆయన పద్ధతి గురించి ఇది ఒక అసాధారణ అంచనా. ఈ ఐసియస్ అధికారి చాలాకాలం క్రితమే విస్మృతుడయ్యాడు. అయిఏత చంపారన్‌లోని ఆయన సహచరర యూరోపియన్లు గాంధీ నుంచి ఎదురైన సవాల్‌ను ఆగ్రహం, భయం, జాత్యహంకారంతో ఎదుర్కొన్నారు. అయితే హే కాక్ వాటికి దూరంగా ఉండి గాంధీని నిష్పాక్షికంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించినందుకు మనం ఆయన్ని తప్పక గుర్తుచేసుకోవాలి.

– ఆంధ్రజ్యోతి మే, 2017



# 10. గాంధీజీ.. 'చంపారన్' ప్రయోగం

**- చలసాని నరేంద్ర**

భారత స్వాతంత్ర్య సమరానికి ఆత్మవిశ్వాసాన్ని, ఆయుధాన్ని అందించిన ఉద్యమం గాంధీజీ నిర్వహించిన చంపారన్ సత్యాగ్రహం. దేశానికి స్వాతంత్ర్య కాంక్షను రగిల్చిన ఆ సంఘటన జరిగి సరిగ్గా వందేళ్లు పూర్తయ్యాయి. మండుటెండల సమయంలో వేసవికాలం ఉదయాన్నే.. ఏప్రిల్ 10, 1917న మహాత్మాగాంధీ కలకత్తా నుండి పాట్నాకు ఏసి కూడా లేని రైలులో వచ్చారు. అదే తదుపరి దేశ స్వాతంత్ర్య సంగ్రామానికి దేశంలోని రైతులను, గ్రామీణ ప్రజలను పాల్గొనేలా ప్రేరేపించే మహోద్యమానికి భూమిక ఏర్పాటుకు దారితీసింది. అప్పటి వరకు స్వతంత్ర ఉద్యమం అంటే పట్టణ ప్రాంతాల్లోని విద్యావంతులైన కొద్దిమందికి పరిమితంగా ఉంటూ వచ్చింది. గాంధీజీ పాట్నాకు రావడం కూడా అదే మొదటిసారి. అక్కడి నుంచి నేరుగా నీలిమందు రైతులను కలుసుకోవడం కోసం చంపారన్‌కు బయలుదేరి వెళ్లారు.

రాజ్‌కుమార్ శుక్లా అనే రైతు డిసెంబర్ 1916న లక్నోలో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో కలిసి ఒక విధంగా వత్తిడి చేయడంతో గాంధీ ఈ ప్రయాణం పెట్టుకున్నారు. "నిజం చెప్పాలి. అప్పటి వరకు నాకు చంపారన్ ఊరు పేరే కాదు ఈ ప్రాంతపు భౌగోళిక స్వరూపం కూడా తెలియదు" అని గాంధీజీ తన ఆత్మకథలో రాసుకున్నారు. తెలియని ప్రాంతానికి వచ్చినా నీలిమందు రైతులను బ్రిటిష్ వారి దోపిడీ నుండి కాపాడ్డం కోసం విసుగు చెందకుండా సుమారు సంవత్సరం పాటు తీవ్రమైన ఉద్యమం జరిపారు.

ఈ సంవత్సరం భారత స్వాతంత్ర్య 70వ వార్షికోత్సవాలను, అదే సమయంలో చారిత్రాత్మకమైన ఈ సత్యాగ్రహం 100వ వార్షికోత్సవాన్ని జరుపుకొంటున్నాం. ఈ ఉద్యమాన్ని భారతదేశంలో తొలి రైతాంగ పోరాటంగా మాత్రమే కాకుండా గాంధీజీ జరిపిన తొలి రాజకీయ ఉద్యమంగా కూడా చెప్పుకోవచ్చు. ఆ తరువాత అహ్మదాబాద్‌లో మిల్లు కార్మికుల సమస్యలపై, ఖేదా వద్ద రైతుల సమస్యలపై పోరాటాలు నడిపిన గాంధీజీ 1919 నుండి స్వాతంత్ర్య ఉద్యమం సాగించడం తెలిసిందే.

1848 నుండే వస్త్రాల తయారీ, వాడకం పరిశ్రమలో ఉపయోగించే నీలి మందును ఉత్పత్తి చేయడంలో భారతదేశం అగ్రగామిగా నిలిచింది. 17వ శతాబ్దానికే

వెస్టిండీస్‌లో ఆధునిక పద్ధతుల్లో నీలిమందును ఉత్పత్తి చేయడానికి సిద్ధమయ్యారు. ఎప్పుడైతే బ్రిటిష్‌వారు బెంగాల్‌ను స్వాధీనం చేసుకున్నారో అప్పటి నుంచి వస్త్రాలను తెలుపుచేసేందుకు అద్దకాలలో ఉపయోగించే నీలిమందును ఉత్పత్తి చేసే తోటలు పెంచే పనిని రైతులపై బలవంతంగా రుద్దారు. కౌలు రైతులు అందరూ తాము కౌలుకు తీసుకున్న భూమిలో కొంత మేరకు (20 ఎకరాలలో కనీసం మూడు ఎకరాలు) ఈ పంటను నిర్బంధంగా పండించవలసిందే. దీనినే థిన్ కటియా రివాజు అనేవారు.

జర్మన్లు చౌకగా కృత్రిమ రంగును తయారు చేయడంతో నీలి మందుకు డిమాండ్ తగ్గింది. చాలామంది రైతులకు తాము చెల్లించే కౌలు ధర కూడా ఈ పంట అమ్మకంతో గిట్టుబాటు అయ్యేది కాదు. అయితే నిర్బంధంగా పండిస్తూ వుండేవారు. "మానవ రక్తంతో తడవకుండా ఒక్క బొట్టు నీలిమందు కూడా ఇంగ్లాండ్ చేరేది కాదు" అంటూ ఒక బ్రిటిష్ అధికారి రాసాడు. వారికి అతి తక్కువ ధర చెల్లించడమే కాకుండా అబివాబ్స్ పేరుతో అక్రమ సెస్‌లను వారి నుంచి వసూలు చేస్తూ వుండేవారు.

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత జర్మన్ల రంగు అందుబాటులోకి రాకపోవడంతో నీలిమందుకు డిమాండ్ పెరిగింది. అయితే రైతులకు తగు ధర చెల్లించేవారు కాదు. సాగుకోసం తోటల యజమానులు ఏనుగులను కొనాలి అనుకుంటే కౌలు రైతులే అందుకు అవసరమైన డబ్బును సమీకరించుకోవాలి. దానిని హతియాహి అనేవారు. గుర్రాలు, కారులు వంటి వాటిని కొనడానికి కూడా అటువంటి పన్నులను వసూలు చేసేవారు. అంతకుముందు పలుసార్లు ఈ అక్రమాలకు వ్యతిరేకంగా రైతులు అక్కడక్కడా తిరగబడినా బ్రిటిష్ పాలకులు దారుణంగా అణచివేసేవారు.

అటువంటి సమయంలో చంపారన్‌కు చేరుకున్న గాంధీజీ వినూత్నమైన రాజకీయ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు. ఒకవిధంగా ఆ తరువాత దేశ స్వతంత్ర సంగ్రామంలో ఆయన నిర్వహించిన వీరోచిత పాత్రకు ఇదొక ప్రయోగం అని చెప్పవచ్చు. సాధారణ ప్రజలను ఒక అంశంపై శాంతియుతంగా సమీకరించడంలో తనకు గల అసాధారణమైన శక్తి సామర్థ్యాలను మొదటిసారిగా ఇక్కడ ప్రదర్శించారు.

"గాంధీజీ చాల ఆకర్షణీయమైన వ్యక్తిత్వం గలవారు కావడంతో లక్షలాది మంది ప్రజలను సమీకరించగలుగుతూ వుండేవారని అంటూ వుంటారు. అయితే

క్షేత్రస్థాయిలో ప్రజలను ఆయన అర్థం చేసుకుంటూ ఉండటమే సత్యం. అందుకు ఎంతో కష్టపడుతూ వుంటారు. ప్రతిరోజు తన జీవితంలో వందలాదిమందిని కలుసుకుంటూ వుండటం, ఆయన నడిపే వారపత్రికతో వందలాది మందితో ఆయన సంభాషణలు జరుపుతూ వుండటం చూడండి. అసహజమైన ఆయన రాజకీయ వ్యక్తిత్వం అదుతేమైన అనుభవాల నుండి ఏర్పడినదే" అంటారు ప్రముఖ చరిత్రకారిణి డా. మ ృదుల ముఖర్జీ.

చంపారన్‌లో రైతులు తీవ్ర అణచివేతకు గురయ్యారని, వారు చాలా భయపడి వున్నారని గాంధీజీ గ్రహించారు. అందుకనే న్యాయం కోసం కోర్టులకు వెళ్లడం వలన ప్రయోజనం వుండబోదని భావించారు. "రేయం నుండి విముక్తి చేయడంవల్లనే వారికి నిజమైన ఉపశమనం కలుగుతుంది. బిహార్ నుండి ఆ భయాన్ని పోగొట్టేవరకు మనం కూర్చుండలేము" అంటూ రాసుకున్నారు. ఆ విధంగా వ్యూహాత్మకంగా కార్యరంగంలోకి దిగారు.

కొందరు నమ్మకమైన సహచరులతో, ముఖ్యంగా స్థానిక న్యాయవాదులతో కలిసి ఆ ప్రాంతం అంతా కలియతిరిగారు. రైతుల అభిప్రాయాలను నమోదు చేసుకున్నారు. రైళ్లలో మూడో తరగతిలో ప్రయాణం చేసారు. మండుటెండలను సహితం లెక్క చేయకుండా మైళ్లకొలది నడిచి వెళ్లారు. కొన్నిసార్లు ఆ ప్రాంతంలో సాధారణ రవాణా సదుపాయంగా వుండే ఏనుగులపై కూడా ప్రయాణం చేసారు. దుమ్ము రేపుతున్న గాలుల మధ్యనే ఒక్కొక్క గ్రామం వెడుతూ వచ్చారు.

ఈ ఉద్యమంలో గాంధీజీతో కలిసి సన్నిహితంగా పనిచేసి ఆ తరువాత చంపారన్ సత్యాగ్రహంపై ఒక పుస్తకం రాసిన బాబూ రాజేంద్రప్రసాద్ తన గ్రంథంలో ఏప్రిల్ చివరినాటికి వేలాదిమంది రైతుల కథనాలను నమోదు చేయడం ద్వారా వారి సమస్యలు అన్నింటిపై ఒక అవగాహనకు గాంధీజీ వచ్చారు. "మొత్తం ఆ జిల్లాలో మా వద్దకు వచ్చి తమ బాధలను వివరించని రైతులు వున్న ప్రాంతం అంటూ లేదు" అని పేర్కొన్నారు.

పాట్నాలో కాలు మోపినప్పుడు బ్రిటిష్‌వారు చెబుతున్న కథనాలు మాత్రమే తెలిసిన గాంధీజీ నాలుగైదు రోజుల్లో రైతులను ఏవిధంగా అణచివేస్తున్నారో వారిద్వారానే తెలుసుకుంటూ వచ్చారు. ఆయన కదలికలపై నిఘా వుంచిన అధికారులు,

ఏప్రిల్ 15 నాటికే చంద్రహోయి అనే గ్రామంలో ఒక పోలీసు సబ్ ఇన్స్పెక్టర్ ఆయనను మూడు గంటలపాటు నిలిపివేసారు. జిల్లా పోలీసు కమిషనర్ జారీచేసిన హెచ్చరికను అందజేసారు. ఆయనను "ప్రజా ప్రశాంతత"కు 'ప్రమాదకారి'గా భావించడంతో వెంటనే ఆ ప్రాంతం వదిలి వెళ్లిపోవాలని స్పష్టం చేసారు.

"నేను ఇక్కడి నుండి వదిలి వెళ్లే ప్రసక్తిలేదు. జిల్లా అధికారులు పట్టుబడితే శాసన ఉల్లంఘున కింద ఎటువంటి శిక్షకైనా సిద్ధంగా వున్నాను" అని గాంధీజీ దృఢ సంకల్పంతో స్పష్టం చేసారు. ఆ రోజులలో ఒక సమస్యపై శాసన ఉల్లంఘునకు పాల్పడటం భారతదేశంలో అనూహ్యమైన పరిణామం. బాలగంగాధర్ తిలక్ సహితం ఒక సందరరేలో ఒక ప్రాంతం నుంచి బహిష్కరిస్తే ఆ ఉత్తర్వు మేరకు అక్కడి నుంచి వెళ్లిపోయారు. అయితే మిగిలినవారు నిరసనలు తెలిపారు అనుకోండి.

ఏప్రిల్ 18 నాటికి జైలుకు వెళ్లడానికి గాంధీజీ సిద్ధపడ్డారు. ఆయనను అరెస్టు చేయవచ్చనే వార్త ఆ ప్రాంతంలో కార్చిచ్చులా వ్యాపించడంతో వేలాదిమంది కౌలు రైతులు ఉదయం నుంచి కోర్టు వద్దకు చేరుకోవడం ప్రారంభించారు. "చట్ట ప్రకారం నాపై విచారణ జరపవలసి వుంది. అయితే వాస్తవానికి ప్రభుత్వమే విచారణ ఎదుర్కోవలసి వచ్చింది" అని ఈ సంఘటనపై ఆయన రాసుకున్నారు. ఆవిధంగా ప్రజలు పెద్దఎత్తున గుమికూడడం అధికారులలో వణుకు పుట్టించింది.

ఆ ప్రాంతం విడిచి వెళ్లిపోతానని, తిరిగి రానని హామీ ఇస్తే ఆయనపై కేసును ఉపసంహరించు కుంటామని హామీ ఇచ్చారు. అయితే అందుకు గాంధీజీ తిరస్కరించారు. "ఇప్పుడే కాదు నేను జైలు నుంచి తిరిగి వచ్చిన తర్వాత కూడా చంపారన్‌ను నా ఇల్లుగా మార్చుకుంటాను" అని దృఢంగా జవాబిచ్చారు.

ఏప్రిల్ 20న ఉదయం 7 గంటలకు గాంధీజీ ప్రతివాదన వినిపించడానికి సిద్ధపడుతున్నారని భావించి గందరగోళానికి గురైన పాలనా యంత్రాంగం ఆయనపై కేసు ఉపసంహరించుకుంది. "ఆ విధంగా దేశం మొదటిసారిగా శాసన ఉల్లంఘున ప్రయోగం నుంచి ప్రత్యక్షంగా మొదటి పాఠం గ్రహించింది" అని గాంధీజీ రాసారు.

తన అరెస్ట్ తప్పదనుకొన్నపుడు అంతటితో ఆ ఉద్యమం ఆగిపోకుండా భవిష్యత్ కార్యాచరణను ముందే ప్రణాళికను, అందుకు సహచరులను సిద్ధం చేసారు. తాను

అరెస్టయితే మజ్‌హారుల్, బాబు బ్రిజ్‌కిశోరె ప్రసాద్ ఉద్యమం కొనసాగించాలని, వారు అరెస్టయితే బాబు ధరణిధర్, బాబు రామ్ నవమి కొనసాగించాలని, వారు అరెస్టయితే రాజేంద్రప్రసాద్, శంభూశరణ్, అనుగ్రహ నారాయణసింగ్ చేపట్టాలని.. అంటూ వరుసగా జాబితా తయారు చేసారు. ఈ కొద్దికాలపు సహచర్యంతోనే ఆ ప్రాంతంలోనివారితో జీవితకాలమంతా గాంధీజీ సన్నిహిత స్నేహబాంధవ్యాలను పెంపొందింప చేసుకున్నారు. వారి దినచర్యలో కూడా నాటకీయ మార్పు తీసుకువచ్చారు.

రైతుల పట్టుదల చూసిన ప్రభుత్వానికి ఒక విచారణ కమిషన్ వేయక తప్పలేదు. ఆ కమిషన్‌లో గాంధీజీని కూడా ఒక సభ్యునిగా నియమించారు. అప్పటికే 8 వేల మంది రైతుల కథనాలను నమోదుచేసి వుండడంతో వాటిని సాక్ష్యంగా ముందుంచారు. దానితో రైతులను దోపిడీకి, అణచివేతకు గురిచేస్తున్న తింకతియా విధానాన్ని రద్దు చేసారు. వారినుంచి దోచుకొన్న కొంత మొత్తాలను తోటల యజమానులకు తిరిగిచ్చారు. తాము పండించే పంటలపై రైతులకు మరింత నియంత్రణ కల్పిస్తూ బ్రిటిష్ ప్రభుత్వ ఆధ్వర్యంలోని తోటల యజమానులు రైతులకు ఒప్పంద పత్రాలు కూడా రాసి ఇవ్వవలసి వచ్చింది.

ఈ ఘన విజయం దేశ స్వాతంత్ర్య ఉద్యమాన్ని కొత్త దిశవైపు నడిపించడానికి దోహదపడింది. గాంధీ పాట్నాలో దిగినపుడు దక్షిణాఫ్రికాలో ఆయన ఏదో చేసారని కొద్దోగొప్పో తెలియడం మినహా ఆయన గురించి అక్కడి వారెవ్వరికీ తెలియదు. పైగా ఆ ప్రాంతంలో కాంగ్రెస్ పార్టీ పేరు కూడా ఎవ్వరికీ తెలియదు. తర్వాతి కాలంలో దేశం నుండి బ్రిటిష్‌వారిని వెళ్లగొట్టడానికి 'శాసన ఉల్లంఘన' అనే ఒక బలమైన ఆయుధాన్ని ఈ సత్యాగ్రహం అందించింది. ఇక్కడనే మొదటగా గాంధీని 'బాపు', 'మహాత్మా' అని పిలువడం ప్రారంభించారు. ఈ పేర్లతోనే తరువాతి కాలంలో ప్రపంచం అంతా ప్రసిద్ధి చెందారు.

"అంత కాలం అసహ్యులుగా అణిగిమణిగి పడివున్న ఈ దేశపు అట్టడుగు తరగతుల ప్రజల్ని ఒక్కసారిగా మొక్కవోని ఆత్మగౌరవంతో దిక్కులు పిక్కటిల్లే విధంగా నినదించి, చైతన్యవంతమైన మానవ సమూహంగా మలచిన అదుతేం చంపారన్

సత్యాగ్రహం" అని జెబి.కృపలాని పేర్కొన్నారు. ఈ ఉద్యమంలో భాగంగా కేవలం అణచివేతకు గురవుతున్న రైతులను సమీకరించడంతోపాటు వారిలో ఆత్మవిశ్వాసం కల్పించడం కోసం పలు నిర్మాణాత్మక కార్యక్రమాలు కూడా చేపట్టారు. పాఠశాలలు, ఆసుపత్రులు నెలకొల్పడం, పూర్ధకు స్వస్తి చెప్పమని గ్రామస్తులను ప్రోత్సహించడం, పారిశుద్ధ్య పనులు చేపట్టడం, మహిళల అణచివేతను నిరుత్సాహపరచడం, అంటరానితనాన్ని విడనాడమని ప్రబోధించడం చేసారు. పాఠశాలలను ఏర్పాటు చేయడంద్వారా నిరక్షరాస్యతకు వ్యతిరేకంగా పోరాడటంతోపాటు గ్రామీణ ప్రజలలో చైతన్యం తీసుకురావడానికి కృషి చేసారు.



## "వృక్షరాజం ద్రౌపది" - గాంధీ

- "ఆరోగ్యవంతమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ద్రౌపది తగిన ఉదాహరణ – సీతలో సౌకుమార్యము మూర్తీభవించింది. తాను సుకుమారమైన పుష్పం వంటిది. ద్రౌపది అలాంటిది కాదు. ఆమె వృక్షరాజము వంటిది. మహాబలుడైన భీముని సైతం ఆమె అభీష్టానికి అనుగుణంగా నడుచుకునేట్లు చేసింది. పరులకు సింహ స్వప్నమయిన భీముడు ద్రౌపది ముందు పరమ సాధువు. పాండవులలో ఎవరి రక్షణతో ఆమెకు నిమిత్తం లేదు."
- ఆభరణాలు ఒంటినిండా దిగేసుకున్నవాళ్ళను చూస్తే నాకు అపరిమితమయిన పరితాపం కల్గుతుంది. ఆభరణాలు సౌందర్యాన్ని ఇనుమడింపజేసే సాధనాలు కావని వాళ్ళకెలా తెలియజెప్పటం? ఆత్మగతమయిన అందమే నిజమైన అందం. మరి వాళ్ళ ఆభరణాలు వ్యామోహానికి విరుగుడు ఏమిటి? ద్రౌపది వంటి స్థిరచిత్తం కలిగిన మహిళలు ముందుకు వస్తే తప్ప గత్యంతరం లేదు."

# 11. చంపారన్ ఓ చుక్కాని

**- కె. రామచంద్రమూర్తి**

చర్విత చరణమే అయినా కొన్ని విషయాలు పదేపదే ప్రస్తావించవలసి వస్తుంది. జనాభాలో అధిక సంఖ్యాకుల జీవితాలను అతలాకుతలం చేస్తున్న సమస్య ఏళ్ళూపూళ్ళూ గడిచినా పరిష్కారానికి నోచుకోకపోతే అదే సమస్యను పాఠకుల దృష్టికి మళ్ళీమళ్ళీ తీసుకురాక తప్పదు. రైతు ఆత్మహత్య వార్త లేకుండా ఒక్క రోజైనా గడవదంటే అతిశయోక్తి కాదు. రెండు తెలుగు రాష్ట్రాలలో రైతులు బలవన్మరణాలకు సంబంధించిన వార్తలు ఆందోళన, ఆవేదన కలిగిస్తున్నాయి. శనివారం తెలంగాణాలోని గద్వాల జోగులాంబ జిల్లాలో అప్పుల బాధతో రైతు ఆత్మహత్య చేసుకున్నట్టు సమాచారం. 1998 నుంచి సాగుతున్న ఈ బలవన్మరణ పరంపరను నిలువరించడానికి గట్టి ప్రయత్నం ఇంతవరకూ జరగలేదనే చెప్పాలి. ఎంతమంది ఎన్ని విజ్ఞప్తులు చేసినా పార్లమెంటులో కానీ చట్టసభలలో కానీ ఈ సమస్యను చర్చించి పరిష్కరించే కృషి జరగలేదు. అఖిలపక్ష సమావేశం జరగలేదు. వ్యవసాయదారుల ప్రతినిధులతో, శాస్త్రవేత్తలతో, సామాజిక సేవకులతో ప్రభుత్వాలు సమావేశాలు నిర్వహించి ఈ అంశాన్ని చర్చకు పెట్టి అభిప్రాయాలు సేకరించలేదు. రైతు మరణవార్తలు క్రమం తప్పకుండా రావడంతో సమాజంపైన వాటి ప్రభావం తగ్గిపోతోంది. మీడియా సైతం కలత చెందడం, ఆవేదన వెలిబుచ్చడం తగ్గుతూ వచ్చింది. విపణి ఆధారిత ఆర్థిక విధానాలను విశ్వసించే పత్రికలూ, టీవీ ఛానళ్ళూ రైతుల మరణాలకు సంబంధించిన వార్తలకు స్పందించడం లేదు.

## ఓటు బ్యాంక్‌గా పరిగణించినా సరే....

అయినా సరే, రైతును విస్మరించడానికి వీలులేదు. జనాభాలో దాదాపు 60 శాతం ఇప్పటికీ వ్యవసాయంపైనే ఆధారపడుతున్నారు. ఓటు బ్యాంకుగా చూసినా అది చాలా విలువైనది. ఈ సంగతి పాలకులకు ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. 2014లో కేంద్ర అధికార పీఠం అధిష్ఠించిన ఎన్‌డిఏ కానీ తెలంగాణాలోని పాలకపక్షం టీఆర్ఎస్ కానీ, ఆంధ్రప్రదేశ్‌ను పాలిస్తున్న తెలుగుదేశం – బీజేపీ కూటమి కానీ రైతు సంక్షేమం కోసం ఏయే చర్యలు తీసుకున్నదీ ఏకరవు పెడుతున్నాయి. ఏదో చేయడానికి ప్రయత్నిస్తున్న మాట వాస్తవమే కావచ్చు. ఫలితం లేదు. రైతుల

ఆత్మహత్యలు ఆగడం లేదు. ఆత్మహత్యలు వ్యవసాయ సంక్షోభానికి కారణం కాదనీ, ఇతర కారణాల వల్ల అనీ మనల్ని మనం మభ్యపెట్టుకోవడం ఆత్మవంచన. ఇతరులను దబాయించడం పరవంచన. గజం మిథ్య. పలాయనం మిథ్య అనేది వాదనకు నిలబడదు. సమస్యను గుర్తించి దాని పరిష్కారానికి చిత్తశుద్ధితో కృషి చేయడం, సమస్య పరిష్కారమయ్యే వరకూ కృషిని కొనసాగించడం ఒక్కటే మార్గం. 1998 నుంచి ఇప్పటి వరకూ దేశంలోనూ, రాష్ట్రాలలోనూ ప్రధాన రాజకీయ పార్టీలన్నీ ఎంతోకొంతకాలం అధికారంలో ఉన్నాయి. ఎం.ఎస్.స్వామినాథన్ కమిటీ నివేదిక సమర్పించిన తర్వాత అన్ని రాజకీయ పక్షాలూ ప్రభుత్వాలూ నిర్వహించాయి. కానీ ఎవరూ ఆయన సూచనలను అమలు చేయడానికి ప్రయత్నించలేదు.

రైతులను ఆదుకోవడం కోసం రైతు సమన్వయ సమితుల (ఆర్ఎస్ఎస్)ను ఏర్పాటు చేస్తున్నామనీ, వాటికి చట్ట హోదా కల్పించే ఆలోచన కూడా ఉన్నదనీ తెలంగాణ ప్రభుత్వం సూచిస్తున్నది. ఆర్ఎస్ఎస్‌లను తక్షణం ఏర్పాటు చేయాలని మంత్రులకూ, ఎంఎల్ఏలకూ ముఖ్యమంత్రి ఆదేశాలు ఇచ్చారు. ఈ సంస్థలను ఏర్పాటు చేయాలన్న నిర్ణయం వెనుక రాజకీయ లక్ష్యం ఉన్నదనీ, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు జన్మభూమి కమిటీలలో టీడీపీ కార్యకర్తలను నియమించి సకల సంక్షేమ, ప్రభుత్వ కార్యక్రమాలు వారి సూచనల మేరకే చేస్తున్నట్టు తెలంగాణాలో కూడా చేద్దామని కేసీఆర్ చూస్తున్నారని కాంగ్రెస్ నాయకుల విమర్శ. పోటీగా రైతు రక్షణ సమితులను నియమిస్తామని పీసీసీ అధ్యక్షుడు ఉత్తమ కుమార్ రెడ్డి ప్రకటించారు. ఇదంతా ఉపరితల రాజకీయ విన్యాసమే కానీ అసలు సమస్యను పరిష్కరించే కసరత్తు కాదు.

కాంగ్రెస్ నాయకులు తమ పార్టీ చరిత్రనూ, మహాత్మాగాంధీ నాయకత్వంలో జరిగిన చంపారన్ ఉద్యమాన్ని అధ్యయనం చేస్తే ఇప్పుడు కర్తవ్యం ఏమిటో వారికి బోధపడుతుంది. నవభారత నిర్మాత జవహర్‌లాల్ నెహ్రూ గత మూడేళ్ళుగా విస్మృతిపథంలో పడిపోయారు. కొత్త తరాలకు నెహ్రూ అంటే తెలియకపోయినా ఆశ్చర్యం లేదు. గాంధీకి సైతం అదే దుస్థితి పట్టే ప్రమాదం ఉంది. ఇందుకు ప్రధాని నరేంద్రమోదీని కానీ, బీజేపీ భావజాలాన్ని కానీ నిందించి ప్రయోజనం లేదు. గాంధీ, నెహ్రూల ప్రాసంగికత తగ్గిపోవడానికి ప్రధాన కారకులు ఈ తరం కాంగ్రెస్ నాయకులే. వారికే గాంధీ జీవితం గురించి తెలియదు. గాంధీ, నెహ్రూలను విస్మరించిన కాంగ్రెస్‌కు

నిష్కృతి ఏముంటుంది? ఈ ఇద్దరూ శిఖర సమానులైన నాయకులు కనుక వారిని గుర్తుపెట్టుకోవాలని చెప్పడంలేదు. నేటి సమస్యలకు పరిష్కారాలు వారి ఆచరణలో కనిపిస్తాయి. రైతుల జీవితాలలో వెలుగు నింపడం ఎట్లాగో, కనీసం చీకటిని తొలగించడం లేదా తగ్గించడం ఎట్లాగో తెలుసుకోవాలంటే గాంధీజీ 1916-17లో నిర్వహించిన చంపారన్ ఉద్యమాన్ని అధ్యయనం చేయాలి. ఇది చంపారన్ శతవార్షికోత్సవ సందర్భం. సరిగ్గా వందేళ్ళ క్రిందట గాంధీజీ నాయకత్వంలో జరిగిన ఉద్యమం ఫలితంగా చంపారన్ నీలిమందు రైతులకు ఊరట లభించింది. ఈతరం యువతకు చంపారన్ ఉద్యమాన్ని పరిచయం చేసేందుకు శాసనసభ మాజీ సభ్యుడు పి.జనార్దనరెడ్డి చొరవతో చిన్న పుస్తకాన్ని ప్రచురించారు. దానిని ఆగస్టు 15న ఆవిష్కరించారు. చంపారన్ ఉద్యమం గురించి గాంధీ, ఆచార్య కృపలానీ, ఇర్ఫాన్ హబీబ్, గాంధీ మనుమడు తుషార్ గాంధీల రచనలను సేకరించి గౌరవ్ చేత అనువదింపజేశారు.

## స్వదేశంలో గాంధీ తొలి ఉద్యమం

దక్షిణాఫ్రికా నుంచి తిరిగొచ్చిన అనంతరం గాంధీ తలపెట్టిన మొదటి పెద్ద ఉద్యమం చంపారన్ పోరాటం. ఇది రష్యా విప్లవం కంటే ముందే జరిగింది. 1916లో లక్నోలో ఏఐసీసీ సభలు జరుగుతున్న సమయంలో బీహార్ నుంచి రైతు నాయకుడు రాజ్‌కుమార్ శుక్లా గాంధీని కలుసుకొని తమ ప్రాంతంలో నీలిమందు రైతుల దుస్థితిని పరిశీలించవలసిందిగా కోరాడు. అతని కోరిక మన్నించి చంపారన్ వెళ్ళిన గాంధీ రైతుల దుస్థితిని అధ్యయనం చేశాడు. నీలిమందును వస్త్రాల తయారీలో, అద్దకంలో ఉపయోగిస్తారు. యూరప్‌లో దీనికి గిరాకీ ఎక్కువ. బెంగాల్ బ్రిటీష్‌వారి అధీనంలోకి రాగానే నీలిమందు పండించాలని రైతులపైన ఒత్తిడి తెచ్చారు. ఇది బీహార్‌కు పాకింది. రైతుల నుంచి నీలిమందును కారుచౌకగా కొని విదేశాలకు ఎగుమతి చేసేవారు తెల్లదొరలు. కానీ 1880లో జర్మనీలో సింథటిక్ అద్దకం అభివృద్ధికావడంతో నీలిమందు గిరాకీ పడిపోయింది. యజమానుల ఆదాయం తగ్గింది. రైతుల మీద సుంకాలూ, జరిమానాలూ పెంచారు. తెల్లవారు నేరుగా రైతులను హింసించకుండా జమీందారీల ద్వారా, వారు నియమించిన టేకేదార్ల ద్వారా పీడించేవారు. నీలిమందు నేలసారాన్ని పూర్తిగా పీల్చి పిప్పిచేస్తుంది. కానీ మొత్తం ఇరవై భాగాలలో మూడు భాగాలు విధిగా నీలిమందు సేద్యానికి కేటాయించాలని

నిర్దేశించే 'తీన్‌కఠియా రివాజు'ను ప్రభుత్వం రైతులపై రుద్దింది. ఈ నిబంధన దాదాపు వందేళ్ళు అమలులో ఉంది. తవాన్ పేరుతో పరిహారం వసూలు చేసేవాళ్ళు. జిరాత్ పేరుతో అధిక మొత్తంలో సుంకం విధించేవాళ్ళు. ఆబ్‌వాక్ పేరుతో అక్రమ జరిమానాలు వసూలు చేసేవారు. బిగార్ పేర రైతుల ఎడ్లనూ, వ్యవసాయ పనిముట్లనూ అప్పనంగా వినియోగించుకునేవారు. ఈ దుస్థితిపైన దాదాభాయ్ నౌరోజీ, ఆర్‌సిదత్‌లు పుస్తకాలు రాశారు. నీలిమందు రైతుల సమస్య పరిష్కారం అయ్యేవరకూ గాంధీ మరోపని తలపెట్టలేదు. ఆయన సమాచారం సేకరిస్తున్నానంటూ రైతుల మధ్య ఉన్నారు. తనతోపాటు అనేకమంది వలంటీర్లను రంగంలోకి దింపారు. అనేకమంది న్యాయవాదులు ఆయనకు అనుచరులుగా మారారు. ప్రభుత్వాన్ని రెచ్చగొట్టే వ్యాఖ్యలు కానీ కార్యక్రమాలు కానీ గాంధీ చేయలేదు. రైతుల నుంచి ఫిర్యాదులు స్వీకరించారు. మొత్తం 8,000 మంది నీలిమందు రైతులు తమ ఫిర్యాదులను గాంధీకి అందజేశారు. గాంధీ ప్రాబల్యం గణనీయంగా పెరిగింది. రైతులు గాంధీ నాయకత్వంలో సంఘటితం అవుతున్నారనే అనుమానం తెల్లదొరలకు కలిగింది. జిల్లా వదలి వెళ్ళిపోవాలని 1917 ఏప్రిల్ 16న జిల్లా అధికారి గాంధీని ఆదేశించాడు. 18న జిల్లా న్యాయాధికారి ఎదుట నిందితుడుగా నిలబడిన గాంధీ ధిక్కార స్వరం వినిపించారు. తాను వచ్చిన పని పూర్తి చేయకుండా చంపారన్ వదిలి వెళ్ళేది లేదని ప్రస్ఫుటంగా చెప్పారు.

## దిగివచ్చిన సర్కార్

ప్రభుత్వం నీలిమందు రైతుల సమస్యను అధ్యయనం చేయడానికి ఒక బృందాన్ని నియమించింది. ఇందులో గాంధీకి సభ్యత్వం ఇచ్చింది. రైతులు ఎదుర్కొంటున్న అన్యాయాలనూ, అమానవీయమైన వేధింపులనూ వివరించే సమాచారాన్ని గాంధీ అప్పటికే సేకరించారు. ఆ సమస్త సమాచారాన్ని కమిటీ ఎదుట సమర్పించారు. ప్రభుత్వ ఉన్నతాధికారి డబ్ల్యు మౌడీతో చర్చలు జరిపారు. చర్చలు ఫలించలేదు. తాను చట్టాన్ని గౌరవిస్తున్నాననీ, నీలిమందు రైతులకు సాయపడటానికే వారినుంచి సమాచారం సేకరిస్తున్నాననీ గాంధీ వివరించాడు. ప్రభుత్వమే దిగి వచ్చింది. గాంధీకి తోడ్పడవలసిందిగా అధికారులను ఉన్నతాధికారి ఆదేశించాడు. దీంతో ఖంగుతిన్న జమీందారులు మొదట రైతులను బెదిరించారు. తర్వాత రాజీకోసం ప్రయత్నించారు. గాంధీ సత్యాగ్రహం విరమించలేదు. రాజీకి అంగీకరించలేదు. 1917 జూన్ 5న రాంచీలో బీహార్ – ఒడిశా గవర్నర్ ఎ గెయిట్‌తో గాంధీ చర్చలు జరిపాడు. అక్టోబర్

3న తీన్‌కఠియా నిబంధనను రద్దు చేశారు. ఆబర్‌వాత్ పేరుతో వసూలు చేస్తున్న వడ్డీలు చట్టవిరుద్ధమని నిర్ధారించారు. టేకేదార్ల వ్యవస్థను నిర్మూలించారు. పంటపై హక్కులు జమీందార్లకు కాకుండా రైతులకే ఉంటాయని అన్నారు. ఈ విజయాలన్నీ దేశంలో నిర్వహించిన తొలి అహింసాత్మక ఉద్యమం ఫలితాలు. రెండు అంశాలు గమనించాలి. ఒకటి చంపారన్ గురించి గాంధీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ ప్రకటనలు చేయలేదు. పత్రికలకు ఎక్కలేదు. ప్రభుత్వాన్ని రెచ్చగొచ్చలేదు. ఒకటే సమస్యపైన దృష్టి పెట్టారు. అది పరిష్కారమయ్యే వరకూ అక్కడే దాన్ని పట్టుకునే ఉన్నారు. ప్రభుత్వం తీసుకుంటున్న ప్రతి నిర్ణయానికీ స్పందిస్తున్న కాంగ్రెస్ నాయకులు చంపారన్ చరిత్రనుంచి గుణపాఠం నేర్చుకోవాలి. ఏదో ఒక సమస్యపైన దృష్టి కేంద్రీకరించి అది పరిష్కారమయ్యేవరకూ కృషి చేస్తే సత్ఫలితాలు వస్తాయి. చంపారన్ స్వాతంత్ర్య ఉద్యమానిక స్ఫూర్తి. ఆ తర్వాతనే సర్దార్ పటేల్ బార్డోలీ రైతాంగ పోరాటం చేశారు. అనంతరం మాప్లా ముస్లిం రైతుల తిరుగుబాటు, మద్రాసు ప్రెసిడెన్సీ రైతు ఉద్యమం. చీరాల–పేరాల ఉద్యమం, సహాయనిరాకరణ ఉద్యమం, ఖిలాఫత్ ఉద్యమం, ఇచ్ఛాపురం నుంచి మద్రాసు వరకూ కొమ్మారెడ్డి సూర్యనారాయణ, తలసాని వాసుదేవరావుల ఆధ్వర్యంలో ఆంధ్ర రైతాంగ యాత్ర జరిగాయి. చివరికి స్వాతంత్ర్య సమరంలో రైతులు భాగస్వాములు కావడానికి కూడా చంపారన్ తిరుగుబాటే కారణం. కాంగ్రెస్‌వారు కానీ మరో పార్టీ వారు కానీ చంపారన్ బాటలో నేటి రైతుల సమస్యను అధ్యయనం చేస్తే పరిష్కారం లభించవచ్చు.

– *సాక్షి దినపత్రిక,*
*సెప్టెంబర్ 10*

---

*"No man's thought should be made the centre of a political action; it should help but not control. Acceptance and rejection are varying forms of blind worship. There are priceless treasures to learn from Gndhi as from Marx, but the learning can only be done when the frame of reference does not derive from an Age or a Person."*

- Dr. Ram Manohar Lohia

# 12. పందేళ్ళ తర్వాత

**- వాడ్రేవు చినవీరభద్రుడు**

**'చా**రిత్రక మహోద్యమం చంపారన్ సత్యాగ్రహం' (2017)అనే పేరిట హైదరాబాదు రైటర్స్, ప్రింటర్స్, పబ్లిషర్స్ కోఆపరేటివ్ సొసైటీ వారు ప్రచురించిన ఒక పుస్తకం రావెల సోమయ్యగారు నాకు స్వయంగా తెచ్చి ఇచ్చారు. చంపారన్ నీలిమందు తోటల కౌలుదారుల హక్కుల కోసం గాంధీజీ చేపట్టిన సత్యాగ్రహం ఒక శతాబ్దకాలం పూర్తి చేసుకున్న సందర్భంగా వెలువరించిన జ్ఞాపిక. అందులో తుషార్ గాంధీ, జె.బి.కృపలానీ, సుధీర్ చంద్రలతో పాటు, చంపారన్ సత్యాగ్రహం గురించి గాంధీజీ ఆత్మ కథలో రాసుకున్న అధ్యాయం కూడా ఉంది. గౌరవ్ అనువాదం చేసిన ఆ వ్యాస సంపుటిలో ఇర్ఫాన్ హబీబ్ వంటి ప్రసిద్ధ మార్క్సిస్టు చరిత్రకారుడి వ్యాసం కూడా ఉందని చూపిస్తూ, సోమయ్యగారు, పుస్తకం మూడవ అట్ట మీద రాసి ఉన్న రాహుల్ సాంకృత్యాయన్ వాక్యాల్ని కూడా చూపించారు. ఆ వాక్యాలిలా ఉన్నాయి:

*'బుద్ధుని తర్వాత సంపూర్ణ మానవసమాజానికి ఇంత గొప్ప సందేశం ఇచ్చిన మహాపురుషుడు గాంధీ ఒక్కడే. గాంధీజీ సమస్త మానవులకు చెందినవాడు. ఆయన జీవితపర్యంతం బహుజనుల హితం కోసం పోరాడారు. వారి శ్రేయస్సు కోరేవాడు కాబట్టే ఈ లక్ష్యాన్ని సాధించేందుకు ఆయన బుద్ధుని కంటే కూడా ఎక్కువ కష్టాలు సహించవలసి వచ్చింది. ఆయన నిజంగా ఒక మహాత్ముడు అనడంలో ఎవరికైనా సందేహం ఉంటుందా?'*

**2**

**మ**హాత్మాగాంధీ జీవితంగురించి తలుచుకోగానే సాధారణంగా అందరికీ గుర్తొచ్చేవి రెండు సంఘటనలు. ఒకటి, 1893 జూన్ 7 వ తేదీ రాత్రి గాంధి దక్షిణాఫ్రికాలో మొదటి తరగతి టిక్కెట్టు కొనుక్కుని రైల్లో ప్రయాణిస్తున్నప్పుడు, అతణ్ణి నల్లజాతివాడనీ, మొదటితరగతి పెట్టెలో కూచోడానికి అర్హుడు కాడనీ పీటర్ మారిజ్ బర్గ్ స్టేషన్లో బయటకి నెట్టేసిన సంఘటన. ప్రతి ఒక్క నల్లజాతీ వాణ్ణీ గెంటినట్టే, ఆ రోజూ వాళ్ళు గాంధీని బయటకు నెట్టేసారు. కాని, ఆ మనిషి ఆత్మబలం సామాన్యమైంది

కాదు. ఆ సంఘటన అతడి జీవితాన్నీ, దక్షిణాఫ్రికా భారతీయుల జీవితాన్నీ, భారతదేశ ముఖచిత్రాన్నీ, నేడు ప్రపంచవ్యాప్తంగా, రెండవ తరగతి పౌరులుగా జీవించవలసి వస్తున్న ఎందరో వ్యక్తుల, సమూహాల, జాతుల భవిష్యత్తు చిత్రపటాన్నీ మారుస్తూనే ఉన్నది.

రెండవ సంఘటన, 1922 మార్చ్ 18 న అహ్మదాబాద్ డిస్ట్రిక్ట్ సెషన్స్ జడ్జి ఎదుట తన మీద మోపబడ్డ రాజద్రోహానికి సమాధానంగా గాంధీ ఇచ్చిన వాఙ్మూలం. 'నేను నిప్పుతో చెర్లాడుతున్నానని నాకు తెలుసు. కాని మీరు నన్ను స్వేచ్ఛగా వదిలిపెడితే నేను మళ్ళా ఆ పనే చేస్తాను' అన్నాడాయన కోర్టులో ప్రపంచమంతా వినేటట్టుగా. అంతదాకా మధ్యతరగతికీ, ఉన్నత వర్గాలకీ మాత్రమే పరిమితమైన స్వాతంత్ర్యపోరాటం ఆ క్షణంనుండీ ప్రజాపోరాటంగా మారిపోయింది.

కానీ, ఈ రెండు సంఘటనల మధ్యలో మరింత విశేషమైన మరొక సంఘటన 1917 ఏప్రిల్ 18 న మోతీహారి జిల్లా తిర్హౌత్ మాజిస్ట్రేట్ కోర్టులో సంభవించింది. ఆ మహత్తరమైన సంఘటన గురించి రాజేంద్ర ప్రసాద్ ఇట్లా తలుచుకున్నాడు:

> *'1917 ఏప్రిల్ 18 చంపారన్ చరిత్రలోనే కాదు, మొత్తం భారతదేశ చరిత్రలోనే చిరస్మరణీయమైన రోజు. బీహార్ ప్రాంతంలో బీదవాళ్ళకోసం, కడగండ్లు అనుభవిస్తున్నవాళ్ళ కోసం మహాత్మాగాంధీ ఆ రోజు జైలుకి వెళ్ళడానికి సంసిద్ధమవుతూ ఉన్నారు. సత్యాగ్రహానికి సంబంధించిన ఒక ఆధునిక ఉదాహరణతో సమస్త భారతదేశం తన మొదటిపాఠాన్ని నేర్చుకున్న రోజు అది. ఆక్షణం, దేశానికి తన భవిష్యాదర్శానికి సంబంధించిన కాంతి కవాటాలు తెరుచుకున్నాయి. సత్యానికి ఎన్నటికీ హాని జరగదనేది చిరకాలంనుంచీ నానుడిలో ఉన్నదే అయినా, ఆ సూక్తికి ఒక నిజనిరూపణ సంభవించింది ఆనాడే. బీద కౌలుదారుల కష్టాల్ని తొలగించడానికి కంకణం కట్టుకోవడమే కాక, వాళ్ళని ఆ విధంగా అణచివేస్తున్నవాళ్ళని గాయపర్చరాదని కూడా అంతే నిబద్ధతతో తీర్మానించుకున్న ఆ మనిషి మహాత్మాగాంధీ రూపంలో మనముందు ప్రత్యక్షమయ్యాడు. ఏ విధంగా చూసినా ఒకదానికొకటి పొసగని ఈ విరుద్ధ లక్ష్యాల్ని సమన్వయపరుచుకోడానికి సంకల్పించుకున్న ఆ మనిషిని ఏ అవరోధాలు అడ్డగించగలవు?'*

